30 ఏండ్లకు పైగా
ఎన్నో లక్షల మందిచేత
వాడబడుచున్నది.




# నోపెయిన్

బాధను పోగొట్టును.

CNF-ITL-57

"సౌత్ ఇండియా ఆఫీసు :

5/149, బ్రాడ్వే, మద్రాసు 1."




అన్ని

నొప్పులకు

# అమృతాంజనము

కడుపునొప్పి, నోట నీరూరుట,
త్రేపులు, వాంతులు, మలబద్ధకము
లాంటి అజీర్ణ లక్షణములకు

కేసరిగారి

# ఆదిత్య లవణము

దివ్య ఔషధము

వెల రు. 1 - 75 న.పై.

కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్
మద్రాసు 14.

# గృహలక్ష్మి ప్రచురణలు

| | | రు. |
|---|---|---|
| 1. | ఫ్లారెన్సు నైటింగేలు జీవితచరిత్ర (ఆంగ్లము) | 0.75 |
| 2. | వేప (వైద్యగ్రంథము) : శ్రీ కె. యన్. కేసరిగారు | 0.75 |
| 3. | బిల్వ (వైద్యగ్రంథము) : | 0.75 |
| 4. | అరవింద (నవల) : శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు | 1/- |
| 5. | శ్రీజ్ఞాన ప్రసూనాంబికా శతకము : శ్రీమతి గంటికృష్ణవేణమ్మగారు | 0.37 |
| 6. | నా చిన్ననాటి ముచ్చట్లు : శ్రీ కె. యన్. కేసరిగారు | 2/- |

## మా దగ్గర లభించు గ్రంధము

| | |
|---|---|
| దేవీభాగవతము : శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు | 12.50 |

గ్రంథాలయములకు, ప్రజాహిత సంస్థలకు ధరలు తగ్గించబడును

## 'గృహలక్ష్మి'

## స్త్రీల మాసపత్రిక

28 సంవత్సరములనుండి మహిళాభ్యుదయానికి, అచంచలమైన కృషి చేయుచున్న స్త్రీల సచిత్రమాసపత్రిక, త్రివర్ణ చిత్రాలతోటి, విజ్ఞాన వికాసాలను పెంపొందించే వ్యాసాల తోటి, యింకా నాటికలు, కథలు, బాలవినోదంతోటి ప్రతినెల 15-వ తేది వెలువడుచున్నది. విడిప్రతి 40 న. పైసలు

ఏజంట్లులేని ప్రదేశములలో ఏజంట్లు కావలెను

గృహలక్ష్మి కార్యాలయము

రాయపేట, మద్రాసు-14.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగు ఎడిటర్

సి. సి. పున్నయ్య

సంపుటము ౨౯] అక్టోబరు 1957 [సంచిక ౧౦

# విషయసూచిక



సంతాన సౌభాగ్యవతి




జయజయ గృహలక్ష్మీ స్త్రీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతేమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# ప్రపంచ పురోగమనము



ఆధ్యాత్మిక రాజకీయ రంగాలలో సమానంగా మానవ జీవయాత్ర ఫలప్రదం కావాలంటే సత్యము, ప్రేమ, అహింసలకంటే మానవాభ్యుదయానికి ఉపకరించగలవి మరేమి లేవని చాటిన మహనీయులు గాంధీజీ, శ్రీ సాయిబాబా.

శ్రీ సాయిబాబా దివ్య సందేశము, జీవితము మానవునిలో నిరాశా నిస్పృహలను పారద్రోలి హృదయంలో సేవాసక్తిని, ప్రేమను పూరించి తద్వారా మానవ జీవయాత్ర మరింత సుగమమగునట్లును, సుఖప్రదమగునట్లు చేయునవి. మహిమోపేత

మయిన శ్రీ సాయిబాబా జీవితము పతనావస్థలలోనున్న అనేకులను యీనాటికి సయితము ఉద్ధరించుటకు వినియోగపడుట మహా భాగ్యమనే చెప్పాలి.

ద్వేషాలు, స్పర్థలతో అల్ల కల్లోలముగా నున్న సమాజమునకు పరమాత్మ యొక్క ఏకత్వాన్ని నిరూపించి మానవులలో విశ్వమానవ సౌభ్రాతృత్వమును, సమరస సమైక్యతలను, భూతదయను శ్రీ సాయిబాబా ప్రోత్సహించి అభ్యుదయ, పురోగమనమునకు మార్గదర్శియైనాడు. శ్రీ బాబా సందేశ ఆదర్శ లక్ష్యాలను అనుసరించి ప్రాపంచిక సుఖ సౌఖ్యాలతోబాటు, నైతిక, ఆధ్యాత్మిక ఔన్నత్యమును సాధించవలసినది మానవకోటి. శాంతి సౌభాగ్యాల సాధనకు శ్రీ సాయిబాబా చూపిన మార్గముకంటె మరొకటి శరణ్యము కానేరదు.

గాంధీజీ సయితము మహత్తర రాజకీయ నాయకత్వమును శ్రీ సాయిబాబా ఆదర్శ లక్ష్యాలమీదనే నిర్మించాడు. గాంధీజీ నాయకత్వము సాధించిన ఘన విజయాలు యావత్ప్రపంచానికి కనువిప్పు అయినది.

గాంధీజీకాని, శ్రీ సాయిబాబాకాని చూపిన వెలుగుబాట అన్ని రంగాలలో ఉత్తమోత్తమమయినది. మన దేశానికేకాక యావత్ప్రపంచానికి శరణ్యములు. సుస్థిరమైన శాంతితో సౌభాగ్యవంతంగా జీవయాత్ర గడపుటకుకాని, ముక్తి సాఫల్యమునకుగాని యింతకంటె మెరుగైన మార్గములుండబోవు.

ఈనాటికి సయితం, 39 సంవత్సరముల క్రిందట నిర్యాణము చెందిన శ్రీ సాయిబాబా దివ్యశక్తి మానవకోటికి ప్రాపంచిక సుఖ సౌభాగ్యాలను సమకూర్చడంతోబాటు నైతిక, ఆధ్యాత్మిక అభ్యున్నతికి తోడ్పడుచుండుటను మనము గుర్తించి ఫలమునుపొందవలసియున్నది.

---




# శ్రీ సాయిబాబా సమాధి దినోత్సవము

మద్రాసు షెనాయి నగరులోని సాయినిలయంలో యీ నెల 3 వ తేదిన శ్రీ సాయిబాబా సమాధి మహోత్సవము వైభవోపేతముగా జరిగెను. మంత్రి శ్రీ భక్తవత్సలంగారు సమావేశములో పాల్గొన జాలకపోవుటచే దివాన్ బహదూరు కే. యస్. రామస్వామి శాస్త్రిగారు అధ్యక్షతవహించిరి.

స్వామి కేశవయ్యాజీ తమ సందేశమును పూరించి యీనాడు మన దేశంలో శ్రీ సాయిబాబా వేలాది ప్రజలచే ఆరాధించబడుచున్నాడనియు, ఆయన సందేశము మానవులలో పరస్పరప్రేమను, భగవంతుడు ఒక్కడై సర్వాంతర్యామియనుదానిని చాటుచున్నదనియు, పరమాత్మతో ఐక్యమగుటకు భక్తియోగము సులభమైనదనియు, అది సంపూర్ణమైన పరిశుద్ధమైన ప్రేమనాధారముగా గలదని వివరించిరి.

దివాన్ బహదూరు బండి శ్రీహరిరావు నాయుడుగారు ఉపన్యసించుచు తాము ఇన్స్పెక్టర్ జనరల్ ఆఫ్ రజిస్ట్రేషనుగానున్నప్పుడు సబ్ రిజిస్ట్రారుగా నుండిన స్వామి కేశవయ్యాజీతో తమకుగల పరిచయమును వివరిస్తూ ఉద్యోగధర్మములలో సయితము న్యాయంగాను, నిరాడంబరంగాను, నిష్కపటంగా, నిజాయితీగా వ్యవహరించేవారనియు, ఉద్యోగమునుండి విరమించిన తరువాత మానవసేవకు ఆధ్యాత్మిక అభ్యున్నతికి స్వామీజీ తమ జీవితము నంకితముచేసినందుకు సంతసమును వెల్లడించి, శ్రీబాబా సందేశము అన్నిమతముల సారమనియు, భగవంతుని ఆశీస్సులను పొందుటయనునది మానవులు తమ నిజమైన దేవదూతల ద్వారా సాధ్యమనిరి.

డా॥ కృష్ణన్ (ప్రెసిడెన్సీకళాశాల) ఉపన్యసిస్తూ తాము స్వామికేశవయ్యాజీ భక్తులమనియు 7 సంవత్సరములనుండి శ్రీ బాబా ఆరాధనలలో పాల్గొనుచున్నామని, శ్రీ బాబా జీవితమునకు స్వామిజీ జీవితమునకు రెండు సామ్యములున్నవనిరి. అందు ఒకటిసాయి నిలయమందలి పవిత్రమైన వాతావరణము పేర్కొనతగినదనిరి. ప్రాపంచిక సుఖములను అవకాశములను శ్రీ బాబా కరుణాకటాక్షములవలన భక్తులకు సమకూర్చి భక్తులలో ఆధ్యాత్మికపురోభివృద్ధిని ప్రోత్సహించుట గమనించతగినది. రెండవది తమ తమ ఉద్యోగధర్మాలను నిర్వహించుచు, తద్వారా తమ కుటుంబాలకు, సంఘానికి సేవజేయుటకు అధ్యాత్మికపురోభివృద్ధి అవసరమని ప్రోత్సహించారు. ప్రాపంచిక సుఖసౌఖ్యాలు ఆధ్యాత్మిక పురోభివృద్ధికి అవసరము. పరమాత్మతో ఐక్యమగుటకిది ఎంతైనాతోడ్పడ గలదు. అనేక సమస్యల పరిష్కారమునకు, నైతిక, ఆధ్యాత్మిక పునరుద్ధరణకని స్వామీజీ పూనుకున్న నిరాడంబర సేవా కార్యక్రమమును ప్రశంసించిరి.

శ్రీ రామచంద్ర నాయుడుగారుపన్యసించుచు సాయినిలయంలో తమ దివ్యానుభవములను వివరించిరి. అనేకమంది బాధలను, కష్టములను నివృత్తి చేయుచు సుస్థిరమైన ఆత్మశాంతిని శ్రీ బాబా కరుణా కటాక్షములవలన స్వామికేశవయ్యాజీ సమకూర్చుచున్నారనియు, తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర స్వామి పాదములచెంత మన మనుభవించగల ఆత్మానందము శ్రీ సాయిసన్నిధిన స్వామిజీ కలుగజేయుచున్నారనిరి.

శ్రీ సి. సి పున్నయ్యగారు ఉపన్యసించుచు మానవ శ్రేయస్సుపట్ల ఆసక్తితో నిర్విరామంగాసేవ

చేసి మతములు ఎన్నైనా భగవంతు డొక్కడే కాబట్టి ఏ పేరుతో భజించి, ఆరాధించినా ముక్తిపథమునం దుకోగలమనియు, అందుకుగాను మానవులు విశాల హృదయంతో ప్రేమను, సమరసమైక్యతలను, ఓర్పు, అలవరచుకొని విశ్వకళ్యాణమునకు తోడ్పడునట్లుగా శ్రీ బాబా దివ్యసందేశమును పూరించిరనిరి.

ఏసుక్రీస్తు అయినా, మహమ్మదైనా, మతప్రవక్తఅయినా తమ ద్వారా ముక్తి లభ్యమనుటలోని ఆంతర్యము ప్రజలలో భగవంతునిపట్ల భక్తివిశ్వాసములను పెంపుచేయుటకొరకేకాని ద్వేషం, క్రౌర్యాలతో కలహించుకోడానికి కాదనియు, దానినే శ్రీ బాబా భక్తివిశ్వాస ప్రేమల ద్వాగాకుల, మతముల ప్రసక్తిలేకుండానే పరమాత్మతో ఐక్యము కానగునని చాటిరి.

తమ స్వానుభవమును వివరిస్తూ స్వార్థానికి ప్రాధాన్యతనివ్వకుండా విశ్వకళ్యాణంతోబాటు తన పురోభివృద్ధిని సయితం చిత్తశుద్ధితో ప్రార్థించినచో భగవంతుని అనుగ్రహం లభించగలదనియు, శ్రీ బాబా సాన్నిధ్యంలో తమకేర్పడిన సంతృప్తి, గుండె నిబ్బరం, ఆత్మానందం మహిమోపేతమయినదన్నారు.

శ్రీ రామస్వామి శాస్త్రిగారు శ్రీ సాయి సాన్నిధ్యమున తమ అనుభవముల వివరించుచు ముక్తిపథమునందుకొనుటకు గురుభక్తి, దైవభక్తి అవసరమనియు, సత్యనిరతుడై చిత్తశుద్ధితో పరమాత్మను తెలిసికొనుటకు, పరమాత్మతో, ఐక్యమగుటకు గురువు యొక్క దయానుగ్రహములవసరమనిరి. ధనం, విజ్ఞానం మూలంగా సాధించలేని భగవత్సాన్నిధ్యమును భక్తి మార్గమున సులభసాధ్యమనిరి. శ్రీ బాబా కరుణాకటాక్షములను ప్రాపంచిక అవకాశములు, సుఖములకొరకేకాక ఆధ్యాత్మిక ఔన్నత్యమును సాధించుటకు సయితము భక్తులు వినియోగించుకోవాలని చెప్పి విశ్వమానవ ప్రేమను, పరమాత్మపట్ల విశ్వాసమును విస్తరింపజేయునట్లుగా విజ్ఞప్తిచేసిరి.

శ్రీ టి. పురుషోత్తం M. L. C. గారు ఉపన్యసించుచు తమ అనుభవంలో శ్రీ బాబాను ధ్యానించి, స్వామి కేశవయ్యాజీని స్మరించి అనేకకష్టాలనుండి, యిబ్బందులు, చిక్కులనుండి విముక్తుడనైతిననిరి. భక్తులకు, శ్రీ బాబా పూజారాధనవసతికిగాను మందిర నిర్మాణం సందర్భమున అధికారవర్గం త్వరలో సహాయపడగలరను ఆశను వెలిబుచ్చిరి.

శ్రీ టి. చంగల్వరాయ పిళ్లైగారు వందన సమర్పణము చేసిన తరువాత స్వామి కేశవయ్యాజీ విభూతి, ప్రసాదముల పంచిపెట్టిరి. ఈ ఉత్సవసందర్భమున ఇండియా వైస్‌ప్రెసిడెంటు డా|| రాధాకృష్ణన్, బొంబాయిగవర్నర్ శ్రీ శ్రీప్రకాశ, ఇండియా డిఫెన్స్ సెక్రెటరీ ఓ. పుల్లారెడ్డిగారు, స్వామి రాజేశ్వరానంద, స్వామి రామదాస్, మాజీ మద్రాసు మంత్రి శ్రీ హెచ్. సీతారామరెడ్డిగారలు సందేశములను పంపిరి.

2 వ తేదిన ఉదయం షుమారు 2000 మంది బీదలకు సాయినిలయం ఆవరణలో అన్నప్రదానము జరిగెను.



# కార్తీకమాసము

శ్రీమతి H. కనకలక్ష్మమ్మ



నాస్తి బుద్ధిరయుక్తస్య నచాయుక్తస్య భావన
నచాభావయతశ్శాంతి రశాంతస్య కుతస్సుఖం ॥

బుద్ధి లేనిచో భావమును లేదు. భావము లేనిచో శాంతియునుండదు. సాధకుడగు వాడు భావన లేనిది యేమియు బొందనేరడు. సాధకుడు సదా బుద్ధిచేత విచారణచేయుచుండవలయును. భావనయే భగవానుడు. భావన లేనిది మోక్షము లేదు. భావనా బలమే మోక్షమార్గము.. భావముచేత భావస్వరూపుని చేరవలెను. భావమే భావాతీతమును జూపించును. భావము లేని యాతడు జ్ఞానయోగిగా నేరడు. అంతయు భావముతోడనే కూడియున్నది. భావస్వరూపుడు భావమార్గమున నేగిన జీవన్ముక్తావస్థసిద్ధించును. ఏకాగ్రత లేనిది భావము పుట్టదు. భావము పుట్టనిది నిజభక్తి కానేరదు. భావప్రవాహమే జ్ఞానప్రవాహము. యిట్టి భావప్రవాహవేగమున సప్తద్వారములయందు ప్రియమున వెలిగించిన జ్యోతులను దొన్నెలతో సహా కార్తీకమాసమున భావప్రవాహమున గొట్టుకొని పోవుటయే నిజకార్తికారాధనము. భక్తియను తైలమును యనర్గళీముగ తేనెటీగవలె యిన్ని దినములుగ తాను కూర్చిన ధనము వెచ్చించు కాలమొచ్చినది. అట్లు భక్తితైలమే తీయనిగంగయై యాగంగ సాగరమును తన లక్ష్యమందుంచుకొని తీవ్ర నడకలే, యీ సప్తదీపపు ప్రమిదలను, అంతియేగాక లక్షవత్తులను యేక ముహూర్తమున వెలిగింపబడినవై, లక్ష వత్తి స్వరూపుడైన జీవుడను జ్యోతిని వెలిగించుచున్నాడు తన శరీర గృహమున సిద్ధుడు. ప్రకృతికాంత కెన్నెన్ని ఋతువులు, కాలములు, యవస్తలు కలుగుచున్నవో నటువలెనే యీశరీరమను ప్రపంచమున ఋతువుల జూచుచు, వానినంటక సాక్షిభూతుడై నివసించుచున్నాడు. ఈ కార్తికము భక్తులకు విరహదినములు. తమ నాధునందు యతిప్రేమగల్గి వానింబొంద నానా ప్రయత్నముల సాగించుచుందురు. గాఢ భావము గలిగిన భక్తులపరమార్తిని దీర్ఘ సంకల్పము గలవాడై తనకును తన భక్తునకును భేదమింతయు లేదుగావున, తానేయాతడై, యాతడే తానై యొకరియందొకరున్నారుగాన, సర్వజగత్కళ్యాణమును జేయ గతదినముల గడపిన తన బ్రహ్మచర్యమును చాలించి శ్రీ మహాలక్ష్మిని జేర కుతూహలుండై క్షీరసాగరమునకేతెంచి శేషపాన్పున లక్ష్మీ సహితుడై ఆనందమును, జగత్కళ్యాణమును

జేయించెను. నదీమాతలు తమనాథుని జేరవేవేగ పయనించువారల యానంద మునుగని, భక్తులును తమనాథుడగు క్షీరసాగర శయనుని జేర వాంఛగల్గినవారు గాన, తమతమ ప్రార్థనములందుకొనుమని తమ నాథునితో చెప్పెదరని యాశించి, యాజీవనదులపోకడలును, తమ భక్తి భావనదులును సమమేనని గుర్తించి వారలతో నిట్లనిరి. "ఓ! నదీవనితలారా! మాదొక్కమనవి. మాయాంతరిక పూజ లెన్ని జేసినను, మానాథుడగు గోపాలుని మెప్పింప, బాహ్యసంజ్ఞయు నుదాత్తమేనని భావించి, యొకమాసముగ కదళీ దొన్నెల యందు నానారీతుల జ్యోతుల వెలిగించి, మీహృదయపు నడకల నంపుచుంటిమి. మా హృదయ సదనమునందు ప్రేమజ్యోతుల జ్ఞానసంపర్కమున వెలిగింపబడిన నిత్యనీరాజనములిచ్చుచుంటిమని యాతనికి తెలియజేయ నీ జ్యోతుల, మీయందు విడచి యనుపుచుంటిమి. ఏముగుదలు నిత్యనూతన సౌందర్యమున సాగరరాజును జేరుచున్నారో యట్టి నదీమరాణుల స్నేహము జేసికొని, వారిని నిత్యపూజల జేసి మెప్పించి వారల హృదయవీనులకు సోక తమ దివ్యప్రేమగానమును, నొక్క మాటతో, నొక్క భావముచే, నొక్క బహుమానముచే, జెప్ప, యభావవిమూఢులై, యమనస్కులై జడులై యచల ప్రభుసేవకులు, సగుణ ప్రభుని మందిరమునకు సగుణజ్యోతినంప నిశ్చయించిరని దెలుపుడని చెప్పుమనిరి" మరియును, తమహృదయ భవనమున ఆకాశమంతయు పందిరివైచి రజిత, స్వర్ణ, కుంభంబులోయన తమ భక్త్యామృత కలశముల నాపందిరికి వ్రేలకట్టి, ప్రేమయనుభావము యావిరి రూపమునుధరించి ఆకసముననున్న భాస్కరునికి సోక ఆతడు తన ప్రతిప్రేమనంపి, వారల భావజలధినింకింప జేసి జేసి, వారల నినుమడివిరహుల జేసిన, యాతనినీనాతులు మోరలెత్తిజూడక యుండగలరా? అజ్ఞాన భాస్కరుడవగు నీకృపావృష్టియను శీతల వాయువులుదగిలి, ఆ మేఘములు తిరిగి వారల హృదయపు భూముల దడుపుచున్నాడా (భాస్కరచక్రవర్తి) యిట్లు ఆంతర్య ఆరాధనమును జేసి కృశించి కృశించి, నేలకంటుకొని పోయిన తన ప్రియుల నెట్లాదరింతునాయని, ఆనారాయణుడు తన దివ్యసంకల్పమును జేసినవాడై క్షీరాబ్ధిసుతనారాధించెను. జగత్తు సర్వము వారలమూర్తిమంతమేగావున వారలనిందు, వారలగందు నాతడేగాన భక్తాగ్రేసరు లెల్లరు, తమ దివ్యసంకల్పమీడేరినదని సంతసించినవారై, దివ్యదంపతులకు మూడునిదురలు కాగా తమ దివ్యహృదయములే, లచ్చికి అత్తిల్లు కావున భక్తశిఖామణు లెల్లరు తమ హృదయములను కొల్ల

గొట్టునాతనికి కొల్లగ ఆత్మార్పణమను సహస్రకలశాభిషేకమును, తమ శిరసను పాలవెల్లియందావిర్భవించిన, స్వర్ణ, రజిత, కలశముల సహస్రకలశాభిషేకము నొక్కపరిభ్రమిమ్మరించి యాతనినభిషేకించిరి. మరియు తమ తత్వములవత్తులై వేని లక్ష వత్తులనొక్కపరి వెలిగించి లక్షవత్తుల నోమునోచుచున్నారు. అట్లు యేక ముహూర్తమున యనేక కోట్లన నేల? ఆతడగు దివ్యపరంజ్యోతికి, పరంజ్యోతిని వెలిగించిరి. దివ్యమూర్తియైన నా దేవ దేవునకు దిష్టి తాకునేమోయని తాము జ్ఞానాగ్నియందు తగులబడినవారై, నిత్య నూతన దివ్యతేజోమయములగు శరీరముల ధరించి, ఆతనికి సాదృశులై, అనగా కిరీట, శంఖు, చక్ర, గదా, పద్మములబొంది, సారూప్యము క్రింబడసి, ఆతని పరివేష్టించి, అతనికి దిష్టితగులక తమలోనొకరై యుండు నట్లు కాపాడుకొనిరి. ఇట్లే దేవతలే పెండ్లి బంధువులు కాగా, లచ్చిని, లక్ష్మీనారాయణులుగ జేసి, అతనితో గూడ క్షీరాబ్ధి నుండి నిజక్షీరాబ్ధియగు తమహృదయక్షీరాబ్ధియందు బంధింప నాతురతగలవారై వేవేగ, క్షీరసాగర దంపతులకోరి లక్ష్మిని, తమ జామాతయగు గోపాలుని, ఒంటి కాలుపై నిలువబడి కానుకల వేవేగ నిప్పించుకొని సారెంబెట్టించుకొని, యాతని నిజ సేవకులగు భక్తులు, లక్ష్మీనారాయణుల ను తరలించుకొని వచ్చిరి.

—X—

# బెత్తెఁడు దూరము

శ్రీమతులు చదలవాడ సోదరీ కవయిత్రులు

మొగల పాదుసా అక్బరు మున్నొకప్డు
నిండు కొలువునఁ గూర్చుండి "నిక్కమునకు
దబ్బఱకు మధ్య యొదవెడు దవ్వుఁ దీర్చి
పల్కుఁ"డని సభ్యులందఱవైపు గాంచె

గ్రుడ్లు తేలవేసి కూర్చున్న వారెల్ల
మూఁగవారలైరి మోసమనుచు
తుదకు వీరబలుఁడు మది నిబ్బరమ్మూగ
విన్నవించె నిటుల విశదపఱచె:—

విన్నయది సత్యమంచు భావింపరాదు
కన్నదెన్నటికైన నిక్కమ్ము సుమ్ము
శ్రవణ - నేత్రమ్ములకు నంతరమ్ము బెత్త
అనఁగ నెల్లరు నానంద మంది రపుడు

# బిడ్డలు - తల్లిదండ్రులు

## నిర్మాణాత్మక క్రమ శిక్షణ

శ్రీ కె. వెంకట్రామయ్య



క్రమ శిక్షణ యనగా శిక్షించియు, శాసించియు, అదుపున నుంచుటయేయనియు, అధీనమందున్న వ్యక్తి ఇష్టాయిష్టములను పాటింపక అతని విధేయతను పడయుటయే యనియు చాలమంది అనుకొనుచుందురు. కాని నిర్మాణాత్మక క్రమశిక్షణ యనునది ఇదిగాదు. దాని ఆశయము లివిగావు.

విధేయత జూపుటయే మంచితనమగునా? బిడ్డలను విధేయులుగ జేయుటయే వారికి మేలుచేయుట యగునా? అనెడి విషయములను ముందుగా నాలోచింపవలెను. "మంచి బిడ్డ డెవడయా?" యని ప్రశ్నించిన "విధేయత జూపువాడే" యని చాలమంది సమాధాన మీయగలరు. కారణ మేమన విధేయత జూపుటయే మంచితనమని యనుకొనుట చాల పరిపాటై యున్నది. కాని మంచితనమనునది అంత "లేమి" గుణము కాజాలదు. అది నీతి, న్యాయము, ఔదార్యము, సహనము, సహకారము, సానుభూతి, ఒరుల మేలుకొరకై త్యాగము జూపుట, ఒరుల హక్కులను పాటించుట, గౌరవించుట ఇత్యాది "లెస్స" గుణములతో కూడియుండును. బిడ్డలను విధేయులుగ జేయుటయే మన ముఖ్యోద్దేశమైనచో ఇతరులకు లోబడి యుండెడి బానిస గుణమే గొప్పదని అనుకొనుచుంటిమన్నమాట. "విధేయత విధేయత కొరకే" అనెడి సూత్రప్రకారము శిక్షణ నొందిన వ్యక్తులకు వ్యక్తిత్వముండజాలదు. ఏమియు నాలోచింపక చెప్పినది చేయుటయే వారికలవాటగును. అట్టివారు అధికారుల ఆజ్ఞల ననుసరించి ఎట్టి ఘోర కార్యములనైనను ఏమియు ననక చేయగలరు. ప్రశ్నింపక, చెప్పినది చేయుటయే ముఖ్యమనుకొనెడి ఈ విధేయత వాంఛనీయమగునా? చేయుమన్నది యుక్తమనియు, దానిని చేయుట తన యంతరాత్మ యనుజ్ఞను మన్నించుటయేయనియు గుర్తించి చూపెడి విధేయతయే వాంఛనీయము. అదియే సరియైనది. దుష్టమును, అన్యాయమును, అవినీతికరమునగు పనులనుగూడ విధేయతతో జేయుట సుగుణ మనిపించుకొనదు. కాని ఏది చేయదగునో, యేది చేయ తగదో ఎల్లప్పుడు కచ్చితముగా తెలిసికొనుట యెట్లు? అది యెట్లైనను అనాలోచిత విధేయతతో నబ్బునది మాత్రముకాదు.

అధికారమునకు లోనైయుండుట అవసరమే యగును. లేనిచో ఐకమత్యమును సహకారమును జనులలో సాధ్యపడవు. కాని ఆ యధికారము నంగీకరించుట భయముచే కారాదు. అది న్యాయము, ధర్మము అని తలంచుట చేకావలెను. ఒక్కొక్కప్పుడొక వ్యక్తి స్వార్థమునకును, అహంకారమునకును లోనై నీతి విరుద్ధముగను, హానికరముగను చరింపబోవచ్చును. అట్టియెడ అధికారము శాసన రూపమున నడ్డుపడి అతనిని సరియగు త్రోవలో నుంచగలదు.

(సశేషము)

# తీరిక సమయాల్లో పరోపకారం

## అమెరికా కళాశాలా విద్యార్థినుల సరదా

కొలంబియాలో

స్టీఫెన్స్ కళాశాల విద్యార్థినులు తీరిక సమయాల్లో స్థానిక ఆస్పత్రికి వెళ్లి అక్కడ చికిత్స పొందే పిల్లలతో ఆడుతూ పాడుతూ కలాసాగా కాలం గడుపుతుంటారు. మరికొంత మంది ప్రార్థనలు సలుపుతారు. ఇలాచేస్తూండడంవల్ల స్త్రీల జూనియర్ కళాశాలల్లోని మత కార్యక్రమాల ప్రథమ డైరెక్టర్ యొక్క ఆదర్శాలన్నీ శాశ్వతంగా నిలిచేలా ఈ విద్యార్థినులు చేస్తున్నారు.

1921 లో శ్రీమతి జెస్సీ బుర్రాల్ యూబ్యాంక్, వారానికి ఏడు రోజులూ అంటే ప్రతిదినం పూజలు, పునస్కారాలు, మత బోధనలు ప్రార్థనా సమావేశాల ద్వారా మతోద్ధరణకోసం ఒక కార్యక్రమాన్ని రూపొందించింది. దీనికి "బుర్రాల్" కార్యక్రమం అన్న పేరు ప్రసిద్ధికెక్కింది.

గత సంవత్సరం ఈ కార్యక్రమం అమలు జరపడంలో 14 ప్రాంతీయ సేవా పథకాలను ఏర్పాటు చేశారు. వీట్టిలో సేవ చేయడం కోసం స్టీఫెన్స్ కాలేజీలోని 1,500 విద్యార్థినులలో రెండింట మూడు వంతుల మంది స్వచ్ఛందంగా ముందంజ వేశారు. విద్యార్థినులు, ఇతరుల అవసరాలను గుర్తించి వారికి తగిన అసరా ఇవ్వడానికి సంసిద్ధురాలు అవడానికీ; తమలోని సాంఘిక బాధ్యతా భావాన్ని పెంపొందింప చేసుకోడానికిగాను సహాయపడటానికి; ఉత్తరోత్తరాలంటే కాలేజీలో విద్యాభ్యాసం పూర్తయిన తర్వాత తన స్వస్థలంలో ప్రయోజనకరమైన జీవితం గడవడానికీ, ఈ స్వచ్ఛంద సేవాకృషి పథకాలు రూపొందింప బడినాయి.

పిల్లలతో కలిసి మెలిసి పనిచేసే పథకాలపై ఎక్కువమంది విద్యార్థినులు అభిలాష చూపిస్తున్నారు. భావి జీవితంలో తల్లులుగాను, ఉపాధ్యాయినులుగానూ తయారయే బాలికలకు ఇవి చక్కని శిక్షణను ఇస్తాయి. బాల స్వచ్ఛంద భటుల సమావేశాలను అజమాయిషీ చేసే ఉపాధ్యాయినులకు (మదర్స్) సహాయకులుగా పనిచేయడానికి గానీ, లేక బాలికా స్వచ్ఛంద సేవికల నాయకురాళ్ళుగానూ, 'కాంప్‌ఫైర్' బాలికల నాయకురాళ్లుగానూ పనిచేయడానికి గానీ, ఎల్లప్పుడూ వీరితో అవసరము వస్తూనే వుంటుంది.

(సెలవు దినాలు కాక) ప్రతి రోజూ ఈ

స్వచ్ఛంద సేవికలు స్థానిక నర్సరీ పాఠశాలకు వెళ్ళి అక్కడి పిల్లలతో ఆటలు ఆడటమో, పాటలు పాడటమో, అదీ కాకపోతే డైరెక్టర్లకు సహాయపడుతూనో వుంటారు. ఇక ఆదివారాల్లో, ఇంటిదగ్గరున్న పసిపాపల స్నానపానాదుల విషయంలో శ్రద్ధ తీసుకుంటారు. లేదా వారి తలిదండ్రులు క్రైస్తవ దేవాలయాల్లో ప్రార్థనలు చేస్తూంటే అక్కడున్న నర్సరీ పాఠశాలలోని పసిపాపలను చేరదీసి వారిని కవ్వించి నవ్వించి కులాసాగా ఉండేటట్టు చేస్తూంటారు.

చెవిటివారికోసం స్థాపించిన పాఠశాలలోని పిల్లలను ఈ బురాైల్ పథకాన్ని అనుసరించి సేవచేసే విద్యార్థినులు సినిమాలు మొదలగు వినోద కార్యక్రమాలకు తీసుకెళ్లడమూ, ఆట పాటలలో ఆనందాన్ని హాయిని వారికి కల్గించడంలో నిమగ్నులై ఉంటారు. శిశు సంక్షేమ కార్యాలయాలవారితో పనిచేస్తూ ఈ విద్యార్థినులు అవస్థలలోనున్న కుటుంబాల వారికి సహాయం చేస్తూంటారు.

ఈ పథకాల్లోకల్లా చక్కనయినది ఒకటుంది. అదేమిటంటే క్రిస్‌మస్ పండగ కోసమని ఒక పాపను 'దత్తత' చేసుకోవడం. వీరు క్రిస్‌మస్ దత్తత పిల్లలను ఏరుకొని, ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ వారి యిష్టా యిష్టాలు తెలుసుకుంటారు. అలా తెలుసుకున్న తర్వాత ఆ దత్తత తీసుకోబడిన 'పాపకు' ఇష్టమైన వస్తువును క్రిస్‌మస్ బహుమానంగా పంపిస్తారు. ఇదీ ఆ దత్తతలోని ఆదర్శం. ఈ దత్తత పథకాన్ని అనుసరించి క్రిందటి సంవత్సరం 800 మంది అనాథులైన పిల్లలకు ఈ క్రిస్‌మస్ బహుమానాలు ముట్టినవి. ఒక రవాణా కంపెనీవారు ఖర్చులకుగాను కానీ కూడా పుచ్చుకోకుండా వీటిని ఆయా పిల్లలకు అందజేశారు.

క్రిస్‌మస్ పండుగకు, శిశుసంరక్షణ కేంద్రాల్లోని ఆట స్థలాల్లో గుర్రపు బొమ్మలను తయారుచేసి, వాటికి రంగులు పూసి ఆడుకునేందుకు వీలుగా అమరుస్తారు. గత సంవత్సరం స్టీఫెన్స్ కాలేజిలోని క్రిస్‌మస్ వేడుకలకు ఆస్పత్రులనుంచి 70 మంది రోగులను ఆహ్వానించి వారితోబాటు ఎంతోమంది పిల్లలకుకూడా వినోదాలను కల్పించారు. కదల్చడానికి వీలులేని రోగులకు ఆస్పత్రిలలోనే సెలవు దినాల్లో వినోద కార్యక్రమాలు ఏర్పాటు చేస్తారు.

విద్యార్థినుల సంస్థలవారు ఆస్పత్రిలలోని వికలాంగులైన శిశురోగులకోసం ఆట వస్తువులనుచేసి ఇస్తూంటారు. ప్రతి సాయంత్రం కొందరు విద్యార్థినులు ఆస్పత్రులకు వెళ్లి అక్కడి పిల్లలకు కొన్ని చేతి పనులు నేర్పడం, వాళ్లకు కమ్మటి కథలు గాథలు చెప్పడం ద్వారా వారి

బాధలను మరపింప చేస్తారు. కొందరు సాంఘిక కార్యక్రమాలను అజమాయిషీ చేస్తూంటారు. మరికొందరు స్త్రీ రోగుల దగ్గరకు వెళ్లి వారిని కుశల ప్రశ్నలు వేసి కులాసాగా ఉండేటట్టు చేసి, వారు చేసే పనులలో వీరుకూడా చేతులు కలుపుకుంటారు.

ముసలివారి సంక్షేమంకోసం బూన్ క్రొందీ విశ్రాంతి భవనాన్నొకదానిని స్థాపించారు. ఇక్కడున్న ముసలి వాళ్లందరూ వారం వారం వారిని సందర్శించే స్టీఫెన్సు విద్యార్థినుల కోసం ఎదురు చూస్తూంటారు. విద్యార్థినులు అక్కడికివచ్చి వారికి చక్కని పుస్తకాలు చదివి వినిపించడం; చిన్న చిన్న నాటికలు, సినిమా ప్రదర్శనాలతో వినోదాన్ని చేకూర్చడం; వారికి క్రొత్త క్రొత్త విషయాలు చెబుతూ, వారు చెప్పే 'అవ్వయ్య కథలు' వింటూ కులాసాగా కాలక్షేపంచేసి, వారున్న కాస్సేపు ఆ సంక్షేమ భవనాన్ని భూతలస్వర్గంగా మారుస్తుంటారు.

విదేశాలనుంచి వచ్చిన విద్యార్థుల కోసమని ఏర్పాటయిన సహాయవేతనాల సహాయార్థం ఈ బురాల్ కార్యక్రమాన్ని అనుసరించి పనిచేస్తూన్న స్వచ్ఛంద విద్యార్థినులు పాటుపడుతుంటారు. అంతేకాకుండా ఆసియా పథకాలకు అనుగుణంగా విదేశాలలో ఉన్న వారి సహాయంకోసం దుస్తులు పుస్తకాలు పంపడంలో వీరెంతో చేదోడు వాదోడుగా ఉంటారు.

ఈ బుర్రాల్ కార్యక్రమంలో పాల్గొనడం మూలంగా, స్టీఫెన్స్ కాలేజీ పట్టభద్రుల్లో చాలామంది పల్లె ప్రాంతాల్లోనూ, సంక్షేమ సేవా పథకాల్లోనూ నిర్విరామంగా కృషి చేస్తూనే ఉన్నారని, విద్యావేత్తల పరిశీలనలవల్ల తేట తెల్లమవుతూంది. ఈ కార్యక్రమం, విద్యార్థినుల జీవితాలమీద కూడా ఎంతో ప్రభావాన్ని కలిగించింది. ఉదాహరణకు - ఈ కార్యక్రమంలోని ఒక వైద్య విద్యార్థిని "నేను మొట్టమొదటగా ఈ కళాశాలలోకి అడుగు పెట్టినప్పుడు (అంద చందాల) అలంకరణ శాస్త్రాన్ని చదువుకుందామన్న అభిలాష ఉండేది. కాని ఇప్పుడు నేను సాంఘిక శాస్త్రాన్ని అభ్యసించాలని అనుకుంటున్నాను" అని మనోభావాన్ని వ్యక్తం చేసింది.

---

# శ్రీ సాయిబాబా మహాసమాధి

## స్వామి కేశవయ్యాజీ సందేశము



మద్రాసు, షెనాయ్ నగర్‌లోని శ్రీ సాయినిలయములో 3–10–57 తేది శ్రీసాయిబాబా మహా సమాధి మహోత్సవ సందర్భమున స్వామి కేశవయ్యాజీ భక్త బృందమునకు ఇచ్చిన సందేశము:

ధర్మ సంరక్షణార్థమై భగవంతుడు అప్పుడప్పుడు ప్రపంచమున అవతరించుననుట సుప్రసిద్ధము. మహాభక్తులందరు భగవానుని అవతారమూర్తులే. అట్టి భక్త శిఖామణులలో నొకరైన శ్రీ సాయిబాబా మహాసమాధి మహోత్సవ సందర్భమున నేడు మనమిక్కడ సమావేశమైనాము.

నేటికి సరిగా 39 సంవత్సరముల క్రిందట సాయిబాబా ఈ ప్రపంచమున తన భౌతికకాయమును విడిచిపెట్టినాడు. అయినా, ఆ మహనీయుని ఆత్మ మాత్రము సర్వదా మనలను కంటిని రెప్పవలె కాపాడుచునేయున్నది. మనకష్టములెట్టివైనను, – అవి మనము సల్పిన దుష్కర్మల ఫలితములు కానీ, పరులవల్లనే కలుగనీ – వానిని నివారించి, భక్తులను రక్షించుటే బాబా సంకల్పము. తన భక్తులయెడల బాబాకు గల ప్రేమ అపారము "నేను మీయందనుండ మీకేలభయము ?" అనుచు సాయిబాబా తన భక్తకోటికి అభయ మొసగుచున్నాడు.

ఆసేతుహిమాచల పర్యంతము అశేషభారతవర్షములో కోట్లకొలది ప్రజలకు షిర్డీ సాయిబాబా పితృసమానుడు; పరమపూజ్యుడు. బాబా మతముప్రకారము మానవుడు మోక్షసాధనకు వేద, శాస్త్రములను వల్లెవేయనక్కరలేదు; సిద్ధాంత పూర్వపక్షములను చేయవలసిన పనిలేదు; తర్కవితర్కములు సయితము అవసరము లేదు. భగవంతునివలె పవిత్ర జీవితమును గడుపుటే మానవుని పరమలక్ష్యము కావలెను. అదే మోక్షము, అదే ముక్తి. విశుద్ధమగు ఆధ్యాత్మిక జీవితముద్వారా, సర్వసంగ పరిత్యాగముచే అలవడిన నిరాడంబరత మూలముగా, నిరవధికమైన కారుణ్యముచేత సాయిబాబా తన దరిజేరిన వారి నందరిని కాపాడినాడు. ఆనాడే కాదు, ఈనాడుకూడా లక్షలాది భక్తజనులు బాబా అనుగ్రహమునకు పాత్రులగుచున్నారు.

"నన్ను శరణుజొచ్చిన వారితో నా సమాధి మాటాడగలదు. వారి కష్టములను పంచుకొనగలదు" బాబా తన సమాధినుంచే భక్తతతిని హెచ్చరించును. ఉద్యోగములు కోరువారు, సంతానమును కాంక్షించువారు, సంపదలను ఆశించువారు, ఆరోగ్యమును పొందదలచినవారు, శాంతి నపేక్షించిన వారు, పలువిధములైన కోర్కెలుగలవారు ఎందరెందరో బాబా చుట్టు మూగెడివారు. ఐహిక సంబంధమైన వారి కోరికల నీడేర్చి, సత్య, ధర్మమార్గావలంబనచే శ్రీ సాయిబాబా వారి నందరిని ఆధ్యాత్మిక పథమునకు త్రిప్పెడివారు.

సాయిబాబా ఆడంబర మెరుగని సాధుపుంగవుడు. పసిబిడ్డవలె వినిర్మలుడు. తన భక్తులకు తాను సేవకుడనని ఆమహనీయుడు ప్రకటించుకొన్నాడు. ఆశించినచో ఆయన మహారాజువలె సమస్తభోగ భాగ్యముల ననుభవించగల్గినవాడు; అయినప్పటికీ, ఫకీరువలె బిచ్చమెత్తి జీవించినాడు. ఆయన పాదముల కడ భక్తులు సమర్పించిన ధనమునకు, వెలలేని కానుకలకు లెక్కలేదు. కాని, వాని నన్నిటిని బాబా తిరిగి పేదలకే పంచిపెట్టినాడు. తుదకు, బాబా సమాధి జరుగునాటికి పదునారు రూప్యములు మాత్రము మిగిలినవి. పేదలపట్ల ఆదరణతో దానధర్మములు చేయవలెనని బాబా బోధించినాడు. దానమును గురించి ఆయనచేసిన మహోపదేశమిది : "దీనులకు మనమెంతగా సాయపడుదుమో భగవంతుడుమన

లనంత అధికముగా అనుగ్రహించును. జాతి, కుల, మత విచక్షణలేకుండ సమస్తజనులకు సాయము చేయవలెను."

సాయిబాబా ఉపదేశములు సాటిలేనివి. ప్రత్యేకముగా ఏ ఒక్క మతమునకు కాని, జాతికి కాని చెందినవి కావు, అవి సర్వమత సారములు; సార్వజనీనములు. మతమేదైనా మానవులందరు ఒకే దేవుని ఆరాధించుచున్నారనీ, అందరి ప్రార్థనల నాలించు దైవమొక్కడేననీ బాబా ప్రకటించినాడు. హిందువులను, ముసల్మానులను రెండు నేత్రములవలె సమానముగ పరిగణించినాడు. నేటికి సయితము వివిధ ప్రాంతములలో హిందూ, ముసల్మానులు ఉభయులుకూడా అత్యంత భక్తి ప్రపత్తులతో బాబాను ఆరాధించుచున్నారు.

భక్తాగ్రేసరుడైన కబీరు ఇట్లనినాడు: "తూర్పుదిక్కున హరి యున్నాడు. పడమట అల్లా యున్నాడు. నీ అంతరంగమును వెదకిచూడుము - రామ్, రహీములు ఇరువురూ గోచరింతురు." ఇదే విధముగా సాయినాథుడు కూడా ఇస్లాము, హిందూమతములకు అభేదమును బోధించినాడు.

పరమ పవిత్రమైన ఈ మహాసమాధి దివసమున సాయిబాబా దివ్యోపదేశములను స్మరించి, వానిని అనుష్ఠించుటకు మనమందరము శక్తివంచనలేక కృషిసలుపవలెనని కోరుచున్నాను. బాబా ఉపదేశసారమిది! "ఆకటి బాధ ననుభవించువారికి అన్నము పెట్టుట, దప్పిగొన్నవారికి దాహమిడుట, కట్టుబట్టలు లేనివారికి వస్త్రదానముచేయుట అను నీ మూడుకార్యములచే ఈశ్వరుని తృప్తిపరచుము. కటువుగా మాటాడకుము. పరుల దూషణలను సయితము ఓరిమితో సహింపుము. ప్రపంచము తల్లక్రిందైనను ధర్మమునకు వైదొలగకుము. జీవితానందమును సాధించుటకు ఇదొక్కటే మార్గము."

"అహంకార, మమకారములను త్యజించి సంపూర్ణముగ నన్ను నమ్మితే, నన్ను చేరుటకు అత్యంత సులభోపాయము." అని శ్రీ కృష్ణపరమాత్మ గీతలలో నుడివినాడు. అదేవిధముగ శ్రీ సాయబాబా కూడా తల్లి, తండ్రి,దైవ సముడైన గురువును ఆశ్రయించుటవల్లనే భక్తులు కడతేరగలరని బోధించినాడు. ఇట్టి ఉపదేశమువల్ల ఎందరో కృతార్థులైనారు. "నమ్మి చెడినవారులేరు, నమ్మక చెడిపోడి పొయ్యేరు!" ఇది ముమ్మాటికి నిక్కము.

మహిమోపేతమైన తనజీవితముద్వారా సాయిబాబా లోకమునకు నిరూపించిన విశ్వప్రేమ, నిత్య సత్యము, సుస్థిరశాంతి మార్గములను భారతీయులేకాక, ప్రపంచమందలి సమస్తజనులుకూడా అనుసరించవలెనని హృదయ పూర్వకముగా ప్రార్థించుచున్నాను. శ్రీసాయినాథుని దీవెనలకు మనమందరము పాత్రులమయ్యెదముగాక!



# కమ్మవారి పణతి

## పసల బాలరాజు కథ

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు

సాధారణంగా జంగంకథలలో గేయం, వచనం అధికంగా లేవు. ఈ కథలో బాలరాజు, పణతిని

ఉంటాయి. కాని కమ్మవారిపణతి - పసలబాల రాజుకథ ♦ లో పద్యాలుకూడ ఉన్నాయి. దీని ఊతపదం - 'శ్రీరామ, శ్రీరామ' అని. ఇది సుమారు ముప్పైపుటల గ్రంథం. ఈ పుస్తకం పూర్తి పేరు పతివ్రతా శిరోమణియగు కమ్మవారిపణతి - పసలబాలరాజు కథ. ఇదొక చిత్రమైన ప్రేమకథ. తిరుపతి వేంకటేశ్వరస్వామికి అంకితమీయబడింది.

### కవి

కవిపేరు వీరాస్వామి. ఇంటిపేరు కిన్నెరవారు. తండ్రిపేరు నాగయ్య అని భూమిక పద్యాలనుంచి తెలుస్తుంది.

పుస్తకం అట్టమీద ఉప్పుఏలూరు సమీపమున వున్న కడియమను గ్రామము కాపురస్థుడు ఈ కవి అని వ్రాసిఉన్నది. ఈ ఉప్పుఏలూరు ఏదో? పడమటి గోదావరిజిల్లా ముఖ్యపట్టణము ఏలూరు. కాని దానికి ఉప్పుఏలూరు అనుపేరు ఉన్నట్లు కనబడదు. రాజమహేంద్రవరం సమీపాన కడియం గ్రామమున్నది. కాని కవి స్వగ్రామం అదికాదని తోస్తుంది. ఈ కవి శ్రీశైలం ప్రాంతంలోని చెప్ప దగ్గ మహానందికొండను ప్రశంసించేడు. ముత్రాసీలను వర్ణించేడు. తిరుపతి వేంకటేశ్వరుడికి అంకిత మిచ్చేడు. ఈ అంశములు చూడగా ఇతను రాయల సీమవాసి అని తోస్తుంది.

### కాలం

కవి తాను ఏకాలంవాడో చెప్పుకోలేదు. అంతరంగిక సాక్ష్యాలనుబట్టి లాగవలసివస్తుంది. అయినా

గురించి_

చెప్పుకొనగ సిగ్గుబోవుకదవే
పోవే పోవే రాక్షసి మూదేవి

(పుట 15)

అంటాడు. ఈ మూదేవి 'నల్లతంగాళ్'కథ అను జంగంకథలోని ఒక ముఖ్య పాత్ర. నల్లతంగాళ్ కథను గురించి వివాదరహితంగా కాలనిర్ణయంచేయలేము. కాని ఈ జంగంకథ నల్లతంగాళ్ తర్వాతి కథ అని మాత్రమె చెప్పవచ్చు.

అల్లసాని పెద్దనకవి మను చరిత్రను క్రీ. శ. 1520 ప్రాంతంలో రచించేడు. మనుచరిత్రలోని 'వనిత తనంత తావలచివచ్చిన చుల్కనకాద ఏరికిన్' అను ప్రాపంచికోక్తి (Aphorism) ని ఈ జంగంకథా కవి వలచి వచ్చినదని చులకనజేయ (పుట 9) అని ఉపయోగించేడు. కాబట్టి ఇతను 1520 తర్వాతి వాడని చెప్పవచ్చు.

ఈ పుస్తకంలో తిరుపతి వేంకటేశ్వరుడు 'వేంకటగిరి రాయా' (పుట 24) అని సంబోధన చేయబడ్డాడు. రాయశబ్దం విజయనగర రాజ్యపాలకుల తాలూకుది. ఈ సామ్రాజ్యం చితికి క్రీ. శ. 1700 ప్రాంతానికి నామరూపాలులేకుండపోయింది. ఇట్టి ఉపపత్తులనుబట్టి చూడగా ఈ జంగంకథ క్రీ. శ. 1700 ప్రాంతపు రచన కావచ్చు.

### కథ తీరు

ఈ కవి ఒక ప్రేమకావ్యాన్ని రచించ తలపెట్టేడు. పరిపాలక వంశానికి చెందిన ఒక కమ్మ

♦ కమ్మవారిపణతి - పసలబాలరాజు కథను పి. ఎన్. బక్తవత్సల అండ్ కో, 33 ముల్లాసాయబు వీధి, మదరాసువారు 1916 లో అచ్చువేసేరు.

బాలిక ఒక వెలమబిడ్డణ్ణి వరించి పెండ్లిచేసుకొంది. ఈ సన్నివేశం కొంతవరకు చిత్రమయినది. దేశపరిపాలకులు వైవాహిక సంబంధాలలో, దేశం, కులం ఇత్యాదులు అంతగా పాటించకపోడం చారిత్రిక విషయం. వారికి వివాహ మొక రాచకీయపు ఎత్తు. ఇద్దరు శత్రురాజులు పొత్తుకోసం వైవాహిక సంబంధాలను కట్టుకొంటారు. ఈరకపు సంబంధం పరిపాలకులకు ఒక సాధారణ విషయం.

ప్రేమగాథను కవి గంధర్వకథను చేసేసేడు. ఈ ప్రేమగాథకు ప్రపంచకంలో ఒక్క పిసరు ఆధారం ఉంటుంది. అది జంగంకథా లక్షణం. దేవతలు, మంత్రాలు తంత్రాలు, భేతాళుడు ఇత్యాదులన్నీ చేర్చడం కవి కల్పనలోని లోపాన్ని మాత్రమె వెల్లడిచేస్తూంది. బాలురు చదువుకొనే గంధర్వకథ (Fairy Tale) లాగు తయారయింది. ఇది జానపద గేయం.

వెలమ బాలరాజుకి పణతినచ్చలేదు, ఆమెమట్టుకు గాఢంగా ప్రేమించింది; కాబట్టి విడిచిపెట్టదు. బాలరాజు ఆమెను వదలకొట్టుకోడానికి తనకు చేతనయిన ప్రయత్నమంతా చేసేడు. అతని ప్రేమను పొందడానికి అమానుషమైన పనులను చేసింది. నానా దురవస్థలు పడింది. చివరకి వారి మనస్సులు ఐక్యమయ్యేయి. వివాహానంతరం వైకుంఠానికి పోయేరు. భర్తకోసం సావిత్రిపడిన పాట్లలాగ ఉన్నాయి, పణతి పడేపాట్లుకూడ. పెండ్లాడిన తర్వాత సావిత్రి బాధలుపడగా, పణతి పెండ్లాడక పూర్వమె పడింది.

కథనుంచి సమకాలిక దేశస్థితి, సంఘస్థితి చెప్ప తగినంతగా తెలియరావడంలేదు. పణతి ఒంటిన 600 నగలు ధరించింది.

## జంగం కథా సంప్రదాయాలు

జంగం కథా యథార్థంగా జరిగిన దానిని ఆశ్రయించుకొని ఉంటుంది. ఈకథలోని ప్రేమకథ యొక్క ఆధారలను చెప్పడానికి పరిశోధన అవసరం.

జంగం కథ అంతటా కష్టాలుండి, చివర సుఖంగా ఉంటుంది. ఈ కథ అట్లే ఉంది. మహానంది కొండను పాలించే కలికి రాజుకి సంతానంలేక పోవడం ఇట్టి కథలకు అలవాటే. కథప్రధానపాత్ర మరణంతో అంతమై తర్వాత వైకుంఠ ప్రాప్తికూడ ఈ కథలకు ఆచారమే.

సంఖ్యా సంప్రదాయం అధికంగా ఉంది. ఏడు సంఖ్యకు నిదర్శనాలుబోలెడన్ని! సప్తకన్యకలు (పుట 22) ఏడు మెట్లకిన్నెర, ఏడుఅంతస్థుల మేడ (4), ఏడు మునుగులు (నీటిలో) మునగాలి, ఏడు చెంబుల నీళ్లుతేవాలి, ఏడుగిద్దలనేయి (11), ఏడు తాడిచెట్ల పొడుగు వెదురుపాద (24) ఏడు గడియల తపస్సు, ఏడుగురుదొంగలు, ఏడురాత్రుల్లు ఏడుగడియలు (28) పన్నెండు అంకె సంప్రదాయానికి నిదర్శనాలు - కలికి రాజుకి పన్నెండేళ్లనుంచి సంతానంలేదు, బిడ్డకి పన్నెండేళ్లకి వివాహం.

జంగం కథలో అద్భుతం, అతిలోకపుటంశాలు ఉంటాయి. ఈకథలోని పణతి నీటిలో నడుస్తుంది, రాతినందిని ఆవుగా మారుస్తుంది. నిప్పులో చొరబడుతుంది. దేవతల సహాయం పొందుతుంది మొదలైనవి.

సాధారణంగా జంగంకథలు ఏకపాత్ర ప్రధానాలు. ఈ కథకూడ అంతే. పణతిప్రధానమయినది. ఆమె ఘనతను ప్రకటించడంకోసం బాలరాజు పనికి వచ్చేడు.

## రసం మొదలైనవి

ప్రేమ ఎగుడు దిగుడులు. భయంకరమైన, అద్భుతమైన ఘట్టాలు ఉచితంగా వర్ణించబడ్డాయి. హాస్యరసానికి తావులేకపోలేదు. పణతి ప్రేమ, బాలరాజు భయంవల్ల హాస్యరసావేశాలు కథ అంతటా కనబడతాయి.

ఈ కథలో జానపదమంజరి రగడ కనబడుతుంది. అక్కడ పద్యాలుకూడ చేర్చబడ్డాయి. ఆట వెలది పద్యాలు అధికం. వృత్తాలుకూడ ఉన్నాయి. పద్యాల నడక సాధారణంగా బాగాలేదు, కుంటి పద్యాలని చెప్పవచ్చును. జంగం కథా కవులు కథలలో అప్పుడప్పుడు ఇతర పదాలను, కీర్తనలను చేర్చుతారు. ఈ కవి పద్యాలను చేర్చడం ఇటు జంగం కథా పద్ధతికిగాని, అటు పద్య కవిత్వానికి గాని గౌరవ ప్రదం కాలేదు. ఇతను తొక్కిన అసామాన్యమార్గం జయప్రదం కాలేదు. శైలి సులభంగా ఉంది. మచ్చుకి -

అన్న విడువరా, ముత్తరాచయన్న
నీకు ...... చెల్లెల నేదన్న
ఏమి నెరుగని బాల నన్న నేను
ప్రాణనాథుని కన్నుల జూపవన్న
అనుచు నేడ్వగా కనికరంబు లేక
నిన్ను విడుతునే చిలకలకొలికి, కల్కి

జాతీయాలు, మాండలిక పదాలు పెద్దలైనవి కొంచెంగా కనబడుతున్నాయి. ఉదా :- బచ్చు (♦ కోమటి) బేలు (♦ మోసము 19), చేతికందినది నోటికందలేదు (20), ఆడుగోడు (♦ ఆడుదాని దుఃఖము)

## సందేశం

ఈ కావ్యంలో ఐహిక, ఆధ్యాత్మిక సందేశాలున్నాయి. సంఘంలోని కుల భేదాలు ప్రేమను అడ్డవనీ, కమ్మ వెలమ ఇత్యాది భేదాలు అనవరమని కవి అభిప్రాయమని స్పష్టమవుతుంది. ఇట్టి భేదాలవల్ల దేశానికి కలిగిన అనర్థాలు చూసిన వారు అట్టి అభిప్రాయాలు వెలిబుచ్చడంలో ఆశ్చర్యంలేదు, కాకతీయ సామ్రాజ్యం నాశనానికి అట్టివే ముఖ్య కారణాలు. ఇట్టి భేదాలు నేటికీకూడ నశించలేదు !

ఈ కథలో ఆధ్యాత్మికం ప్రధాన మయింది. ఇందలి జంట ప్రేమికులు ఐహికంగా సుఖపడ్డదేమీ లేదు. వారుకోరినదల్లా ఆత్మల కలయిక. అది భూమి మీద గాక అటుతర్వాత మాత్రమే ఈడేరింది. అల్లసాని పెద్దన్న రచించిన ప్రేమ కథను ఈ కవి ఎరిగినవాడు. ప్రవరుడికి ఆధ్యాత్మికత్వం, వరూథినికి కాముకత్వం దక్కాయి. జానపద కవి సృష్టించిన పణతి తాను ప్రేమించిన వ్యక్తికోసం సర్వం త్యాగం చేసింది. పాపం ఆముష్మికంలో మాత్రమే సుఖాన్ని సాధించింది.

---

# కొత్తరకం "కుకర్"

అన్నం వండేందుకు పనికివచ్చే కొత్తరకం "కుకర్"ను మైసూరులోని కేంద్ర ఆహార విజ్ఞాన పరిశోధనా సంస్థ తయారు చేసింది.

ఈ కొత్త రకం "కుకర్"ను వాడకంవల్ల ఎన్నో లాభాలున్నాయి. ఇతర సాధనాల ద్వారా అన్నం వండినపుడు అది అప్పుడప్పుడు ముద్ద ముద్దగా ఉడికిపోవచ్చు. ఈ కుకర్‌ను ఉపయోగించడంవల్ల ఆ ప్రమాదమేమీ లేదు. పైగా, మరొక ముఖ్యమైన లాభమేమిటంటే యీ కుకర్‌తో వండిన అన్నంలో "బి.1 విటమిను" అలాగే ఉంటుంది కాని హరించిపోదు.

రెండు పౌనులు యీ కొత్త రకం కుకర్ ఖరీదు రమారమి 11 రూపాయలు మాత్రమే. ఇది చవుక కావడంవల్ల సామాన్య కుటుంబీకులుకూడా సాధనాన్ని ఖరీదు చేసుకోవచ్చును.

# తరలి రావోయీ మేఘాల చాటునుండి

శ్రీ M. లక్ష్మీదేవి

1. ధరణియంతయు నంధకారబంధురంబయ్యె
కరుణ యిసుమంతయైన లేక మేఘుంబు గప్పికొనియె
వరుణ ధారలు సయితము కురియ దొడగె
సరియగు వెలుగు లేక జగంబు తల్లడిల్లె
తరలి రావోయీ మేఘాల చాటునుండి ॥

2. రైతులెల్ల నీ రేయి జూచి భీతిగొనిరి
వైతు మెటుల యడుగనుచు ప్రజలెల్ల తొట్రుపడిరి
సైతు మెటులీ బాధలంచు శోకార్తులైరి
కౌతుకమును వీడి కువలయంబుఁ బాలింప
తరలి రావోయీ మేఘాల చాటు నుండి ॥

3. కమలములు నినుగానక క్రుళ్ళిపోయె
విమల వినువీధియంతయు విషయుక్తమయ్యె
అమల జలంబులందెల్ల అడుసు పడియె
సుమల శుభ్రసుందర రూప సూర్యకుమారా
తరలి రావోయీ మేఘాల చాటునుండి ॥

4. సకల సృష్టియందు మోనంబు యధివసించె
వికల హృదయులై విను వీధి జూచి జూచి
తికమకలై ప్రాణులెల్ల దిక్కుల దిరియ దొడగె
వికసిత వదనారవిందవై వసుధఁ బ్రోవ
తరలి రావోయీ మేఘాల చాటు నుండి ॥

5. సాంధ్రతిమిరంబు బాప సోత్సుకముతో
పాంథుని పథమెల్ల ప్రదర్శిత మొందు రీతి
బాంధవా, అఖిల సృష్టికాధారభూత,
ఆంధ్ర భూమిని రంజింపఁజేయ ఆశలూఱ
తరలి రావోయీ మేఘాల చాటునుండి ॥

---

# మాస్కోలో తులసీదాసు స్మారక సభ

---

మాస్కో 21-9-57 (టాస్) - భారతీయ మహాకవి తులసీదాసు 425 వ జన్మ దినోత్సవం సందర్భంగా ఇవాళ మాస్కోలో ఒక సభ జరిగింది. ఈ భారతీయ ప్రాచీన మహాకవికి శ్రద్ధాంజలి ఘటించడానికై సోవియట్ ప్రాచ్య విద్యాధ్యయన వేత్తలు, సంస్కృతీ సేవకులు, మాస్కో విశ్వ విద్యాలయానికీ, స్థానిక విద్యాలయాలకూ చెందిన విద్యార్థులూ, విదేశాలతో సాంస్కృతిక సంబంధాలు నెరపే సోవియట్ సంఘ భవనంలో సమావేశమయారు. సోవియట్ దేశంలో భారతదేశ రాయబార కార్యాలయ కౌన్సిలర్ పి. రత్నం, ఆయన సతీమణి, భారత రాయబార కార్యాలయోద్యోగులూ, మాస్కో ఉన్నత విద్యా సంస్థలలో చదువుకుంటున్న భారతీయ విద్యార్థులూ వచ్చిన అతిథుల్లో వున్నారు.

సభను ప్రారంభిస్తూ ప్రముఖ సోవియట్ రచయిత ఎ. ఛాకోవ్‌స్కీ, యీ మహాకవి భారతదేశంలోనేగాక యితర దేశాలలోకూడా పొందిన ప్రజాదరణగూర్చి మాట్లాడేరు. భాషా శాస్త్రజ్ఞుడు ఇ. ఛెలిషేవ్ తులసీదాసు జీవితం గురించీ ప్రసంగించారు.

భారత రాయబార కార్యాలయ కౌన్సిలర్ పి. రత్నంగూడా ఒక ఉపన్యాస మిచ్చారు; దీనిని సభకులెంతో హర్షించారు.

సోవియట్, భారతీయ కళాకారులూ, ఇప్పుడు మాస్కోలో వున్నటువంటి ఒక బొంబాయి నృత్య నాటక సంఘానికి చెందిన నర్తకులూ యిచ్చిన ప్రదర్శనంతో యీ సభ ముగిసింది.

'టాస్'

# తెల్లరోజా!

| రచయిత్రి : | అనుసరణ : |
| --- | --- |
| ఇన్‌గే షోల్ | డాక్టరు వి. ఎస్. శర్మ |

[జర్మను దేశ స్వాతంత్ర్యాన్ని, పేరు ప్రతిష్టలనూ నిలువబెట్టటానికి జర్మను విద్యార్థి వీరులు, వీరాంగనలూ చూపెట్టిన త్యాగాన్ని చిత్రిస్తూ వ్రాయబడ్డ కథ ఈ "తెల్లరోజా". "తెల్లరోజా" ఆ వీరుల స్వాతంత్ర్యోద్యమ వీర చిహ్నం. అదే వాళ్లు కన్న కలలను కార్యరూపంలోకి తెచ్చింది. వాళ్ల దేశ చరిత్రనే పూర్తిగా మార్చివేసింది. ఈ కథని చిత్రించిన రచయిత్రి ఈ వీరులలో ముఖ్యులయిన హాన్స్, సోఫీల అక్కయ్య. ఆ వీర గాథలని ఆవిడ కళ్ళార చూసింది. చూసిన వాటినే మనకు యథాతథంగా చిత్రిస్తూవుంది. జర్మను భాషలో వ్రాయబడ్డ ఈ వీర గాథను ఆంధ్ర లోకానికి సమర్పించే భాగ్యం లభించింది. "గృహలక్ష్మి" దీనిని ప్రచురించి నందులకు సంపాదకులకు కృతజ్ఞుణ్ణి.]

I

హాన్స్, సోఫీ, క్రిస్టల్‌లు తమ ప్రాణాలని దేశ స్వాతంత్ర్యానికి, వురిస్తంభానికి సమర్పించారు. ఈ సంగతి విన్నాక విద్యార్థులూ, వాళ్లకు తోడునీడగా వుంటూవున్న ప్రొఫెసర్లూ హడలిపోయి ఇక ఈ స్వాతంత్ర్యోద్యమంకేసే కన్నెత్తిచూడరని అధికారులు అనుకున్నారు. ఈ సంగతి విద్యార్థులకు సంబంధించింది. అది ఎలాగో ఒకలాగు వాళ్లకి తెలిసిపోతుంది. ఇక పత్రికల్లో ఆ సంగతి ప్రచురించటం అంత అవసరం లేదనుకున్నారు. అథవా ప్రచురించినా ఏం మోసం వాటిల్లుతుందో అని లోపల వాళ్లకి భయం, యుద్ధం ప్రారంభమైనప్పటినుంచి ఎక్కడో ఒకచోట సైనికులయితేనేం, సామాన్య ప్రజానీకం అయితేనేం, ప్రభుత్వపు చర్యలని, ముఖ్యంగా మిలిటరీ నాయకుల చర్యలని ప్రతిఘటించటానికి ప్రయత్నిస్తూనే వున్నారు. వాళ్ళని హడలగొట్టటానికి ప్రభుత్వం ఒక వైపునా, మిలిటరీ నాయకులు మరొక ప్రక్కనా అవలంబించాలసిన పద్ధతులని అవలంబించారు. అయినా ఆ ప్రతిఘటనోద్యమం అంత సులభంగా ఆగిపోతుందా? అటువంటి దానిని బహిరంగంగా, పత్రికల్లోగాని, రేడియోలోగాని, ప్రస్తావించకుండటమే శ్రేయోదాయకమని అధికారవర్గం తీర్మానించుకున్నది.

ఒక న్యాయస్థానంవారు, అందులో ఉన్నత న్యాయస్థానంవారు, ఏ కేసునైనా విచారణచేస్తే, విచారణ పూర్తి అయ్యాక, దాని తీర్పు పత్రికల్లో ప్రచురిచటం ప్రభుత్వంవారికి అనాదినుంచి తప్పని సరి అయిపోయింది. ఆ పద్ధతి ననుసరించే ప్రభుత్వం వారు ఈ విద్యార్థి వీరుల వురిశిక్ష విషయం ఒక ప్రకటనను, ముక్తసరిగా, నాలుగైదు వాక్యాల్లో స్థానిక పత్రికలకు పంపారు. ఇలాటి వార్తలు తమ పత్రికల్లో ప్రాముఖ్యస్థానంలో ప్రచురిస్తే తమ కేలాటి ముప్పు వాటిల్లుతుందో సంపాదకులకు బాగా తెలును. అంచేత ఈ వార్తను, ఏమూలనో, అంత ప్రాముఖ్యం కాని స్థలంలో చిన్న అక్షరాల్లో ప్రచురించారు.

ఆ ప్రకటనా, ఈ వీరులని వురి స్థంభాల మీదికి తీసుకునివచ్చి, ప్రాణాలని అమాంతంగా తీసివేసిన తరువాత ఏ రెండు వారాలకో ప్రచురింపబడ్డది. ఆ ప్రకటనలో ఇలా వ్రాయబడి వుంది :

“రాజద్రోహం నేరం క్రింద ఉన్నత స్థానంవారు ఈ క్రిందివారిని విచారించి వురిశిక్ష విధించారు.

క్రిస్టఫర్ ప్రొబెస్ట్, 25 సం॥ వయస్సు :

హాన్స్‌షోల్, 24 సం॥ల వయస్సు.

సోఫీషోల్, 22 సం॥ల వయస్సు.

ఈ శిక్ష ప్రకారం నేరస్థులు తక్షణమే వురితీయబడ్డారు.”

పత్రికల్లో ఆ రోజుల్లో ప్రకటింపబడేవి ప్రభుత్వంవారు వాటికి అస్తమానమూ అందచేస్తూవుండే సంగతులు, అలాటి వార్తల్లో, ప్రకటనల్లో, మరి ఇతర విషయాల్లో నూటికి 90 వంతులు యుద్ధానికి సంబంధించినవే. వాటిలోని విషయాలు ఎంత పచ్చి అబద్ధాలో జనానికి తెలుసు. అంచేత పత్రికలనే చూడటానికి బలవంతపు బ్రాహ్మణార్థానికి మల్లె ఏ కొద్ది అధికారులోతప్ప, మిగతా జనాంగం ఏవగించుకొనేది. అలాటి పరిస్థితుల్లో ఏదో మారు మూలలో అచ్చయిన ఈ చిన్న వార్తను చదవటానికి ఎవళ్ళకు వోపిక వుంటుంది. అంచేత మాలో కొంత మందికి తప్ప, ఇతరులకు ఈ వార్త తెలుసుకొనటానికి కొంత కాలం పట్టింది.

◆ ◆ ◆

మా వాళ్లు మృత్యు దేవతకు ఆహుతి అయిన కొన్నాళ్ళవరకు మ్యూనిచ్ నగరంలో రాజకీయ వాతావరణం కొంతవరకు ప్రశాంతంగా వున్నదనే అనాలి. ప్రభుత్వంవారి కట్టుదిట్టాల మూలానే ఇంత చక్కగా వున్నదని, ఇకముందుకూడా ఇలాటి చర్యలను తీసుకున్ననూ అటూ విద్యార్థిలోకం నుంచి ఇటూ ఇతర రాజద్రోహులనుంచీ ఎలాటి ప్రతిఘటనని ఎదుర్కొనటానికి బొత్తిగా అవసరమే వుండదని ప్రభుత్వ నాయకులు అనుకున్నారు. అలాటి ఆలోచనే వాళ్ళ బుర్రల్లో రేకెత్తిందా, ఇక వాళ్లు ఎలాటి రాక్షస కృత్యాలనూ చేయటానికి భయపడుతారా ?......

పండుగ రోజులు వచ్చాయి. క్రీస్తు ప్రభువు - కిరాతకుల వాతబడి ప్రాణాన్ని కోలుపోయిన రోజు మొదటిరోజు ఈస్టర్ శుక్రవారం. ఆ రోజునుంచి మూడు రోజులు సెలవులు. ప్రభుత్వ కార్యాలయాలని కట్టివేశారు, కాని ప్రత్యేకపు కోర్టును మాత్రం తెరిచేవుంచారు. ఎందుకలా చేశారని ప్రజాకోటి విస్తుపోతూవుంది. తెర చాటున ఏం జరుగుతూవుందో జనం అలాటి పరిస్థితుల్లో వూహించుకొనడమూ అంత కష్టంకాదుగా !......

అటూ ప్రజాకోటి పర్వదినాలని జరుపుకొంటూ వున్నారు. ఇటు ప్రభుత్వమూ తన రాక్షస కృత్యాలని జరుపుకుంటూనే వుంది.......

ప్రభుత్వంవారి వుచ్చుల్లో ఈ దఫా పడిపోయిన వాళ్లు హాన్స్, సోఫీ, క్రిస్టల్‌లతో చేదోడు వాదోడుగా నుండి రాత్రింబగళ్లు పనిచేస్తూ వచ్చిన విల్లీ, అలెగ్జాండర్‌లు. వాళ్ళకన్నా పెద్ద దెబ్బతిన్నది యూనివర్సిటీ ప్రొఫెసర్, మా సోఫీ టీచర్, ప్రొఫెసర్ హూబర్. ఇతర ప్రొఫెసర్లదోవ ఒక ఎత్తు. ప్రొఫెసర్ హూబర్ దోవ ఒక ఎత్తు. మొదటి ప్రపంచ యుద్ధపు రోజుల్లో స్వాతంత్ర్యోద్యమానికి పనిచేశాడు. ఆ యుద్ధకాలం ఈ యుద్ధకాలం మధ్య కాలంలో విద్యార్థులని దేశాన్ని ప్రేమించమని, దేశం పేరు ప్రతిష్ఠలను నిలుపుకొనటానికి సిద్ధంగా వుండాలని ప్రబోధించిన మహనీయుడు. మాటలతో నేకాదు, తానూ శాయశక్తులా విద్యార్థులకు అండగా వుండి పనిచేసిన ధీరుడు. హిట్లరు ముఠాకు ఆయన ఇలా విద్యార్థులతో కలిసిమెలసి వుండటం నచ్చదు. అంచేత ఆయనకు రావలసిన ప్రమోషన్‌ని ఆపేశారు. వెయ్యి కళ్ళతో ఆయన చర్యని పసికట్టుతూ, వోపిక పట్టివేచివున్నారు.

ఆయనకూ వాళ్లు తనని ఒక కంట కనిపెడుతూనే వున్నారని బాగా తెలుసు. అయితేనేం ఈ యుద్ధపు రోజుల్లో విద్యార్థులతో కలిసి మెలసి పనిచేయటానికి ఏ మాత్రమూ వెనుదీసినవాడు కాదు. హాన్స్, సోఫీ, క్రిస్టల్ లకు మల్లె తను ఒకవైపూ, తనతో పని చేస్తున్న విద్యార్థులూ ఇంకొకవైపూ వురి స్తంభం మీద ప్రాణాలని కోల్పోవాలని వస్తుందనీ ఆయనకు తెలుసు. అయినా ఇలాటి క్లిష్టావస్థల్లో పూరక వుండే ఘటం అయితేగా ప్రొఫెసర్ హూబర్ ది.

♦ ♦ ♦

II

ఈ ఈస్టర్ పండుగరోజుల్లోనే చడీ చప్పుడు లేకుండా ప్రొఫెసర్ హూబర్ ని, ఆయనకు చేదోడు వాదోడుగా వుండి హాన్స్ సోఫీ, క్రిస్టల్ లనే ఆదర్శంగానుంచుకుని, వారి పద్ధతి ననుసరించే స్వాతంత్ర్యోద్యమాన్ని నడుపుతూవున్న విల్లి, అలెగ్జాండర్ లని అరెస్టుచేసి కారాగారంలోకి తెచ్చారు. "సాక్ష్యం" సమకూర్చటానికి అనే సాకుతో అధికారవర్గం వాళ్లకు పెట్టిన యమయాతనల సంగతి ఇక మాటలతో వివరించటం అనవసరం. ఆ పద్ధతులన్నీ హాన్స్ సోఫీ, క్రిస్టల్ పట్ల వుపయోగించినవాటికన్నా రెట్టింపుగానే వున్నాయి. విద్యార్థులపట్ల వుపయోగించిన దారుణ పద్ధతులు ఒక ఎత్తు. ప్రొఫెసర్ పట్ల అవలంబించిన రాక్షస కృత్యాలు ఒక ఎత్తు. అయినా తొణకలేదు, బెణకలేదు ఆయన. అటువంటి పరిస్థితుల్లో ఆ "సాక్ష్యం" సేకరించటానికి వచ్చిన అధికారులు ఏంచేయగలుగుతారు? తాము సేకరించిన భోగట్టానంతా కోర్టువారి కందజేశారు. విచారణ కూడా పండుగ రోజుల్లోనే అర గంటలో పూర్తి అయిపోయింది. ఆ సమయంలో, విద్యార్థుల తరఫునా తన తరఫునా ప్రొఫెసర్ హూబర్ తన పద్ధతిని సమర్థిస్తూ ఈ క్రింది విధంగా కోర్టువారికి చెప్పారు:

"ఈ రోజుల్లో నావంటి జర్మను పౌరులు, ముఖ్యంగా విశ్వ విద్యాలయంలో ప్రొఫెసర్ స్థానాన్ని ఆక్రమించుకున్న నావంటి పండితులు మా బాధ్యతలని అవగాహనం చేసుకుని, వాటిని మాతోడి పౌరులకు బోధిస్తూ, ప్రతిఘటించటానికి సర్వావస్థల్లో సిద్ధంగా వుండాలి. ఈ బాధ్యతనే దృష్టిలో నుంచుకుని నా దగ్గర చదువుకుంటూవున్న విద్యార్థులు ఈ ధర్మ మార్గాన్నే నడవాలని బోధించటానికి ఏ మాత్రం తటపటాయించిన వాణ్ణి కాను.

జర్మను సంస్కృతి ఇంతకాలం కీర్తికాంతులతో నిలిచివుండటానికి, ఈ జాతిపట్ల లోకులు చూపుతూ వున్న గౌరవ మర్యాదలకు కారణం ఏమిటో మనం ప్రశాంతంగా ఆలోచించాలి. అలా ఆలోచిస్తే మన పూర్వులు జ్ఞాపకం వస్తారు. వాళ్ళలో రాజ్యతంత్రజ్ఞులు వున్నారు. కవులు వున్నారు. పండితులు వున్నారు. వాళ్లు ఈ ధర్మ పథాన్ని నిష్కళంకంగా నిలువబెట్టి తరువాతి వారికి ఆదర్శమూర్తులుగా వుండటానికి ఎలాటి త్యాగంచేసి ధన్యత గాంచారో మన కంతా తెలుసు, ఆదర్శమార్గంలో నడవటం విద్యార్థుల బాధ్యత అని వాళ్ళకు నిర్భయంగా చెప్పాను. ఇలాటి ధర్మ సాధనలో నా గురువు, నా ఆదర్శమూర్తి కాంట్ పండితుడు. ఆయనే అన్నాడు తను రచించిన తత్త్వ శాస్త్రంలో "ప్రభుత్వపు బాగోగులకూ ప్రజాలోకపు సుఖదుఃఖాలకూ దేశంలో పుట్టి పెరిగిన ప్రతివ్యక్తికీ, ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ బాధ్యత వున్నది." ఈ వ్యక్తులే, వాళ్లు — కలవారు కానీయండి, బీదసాదలు కానీయండి, పిన్నలు కానీయండి — దేశ కల్యాణాన్ని మానవకోటి శాంతి సంపదలని చిరస్థాయిగా నిలవబెట్టటానికి ప్రాణాలను సమర్పించటానికి అహోరాత్రులూ సిద్ధంగా వుండాలని, అప్పుడే ఆ జాతికి జాతి అనే పిలుచుకుని గర్వపడటానికి గౌరవార్హతలు వుంటాయని కాంట్ పండితుడే నిర్భయంగా చెప్పాడు. ఆయన శిష్యకోటిలోని వాళ్ళమని గర్వపడుతూవున్న మా వంటి వాళ్లు, ఈ రోజుల్లో ఆయన చూపెట్టిన ధర్మమార్గంలో నడవటానికి మాకు అవకాశభాగ్యం లభించి నందుకు గర్వపడుతున్నాం.

ప్రజల క్షేమంకోసమనీ, జాతి రక్షణకోసమనీ,

ప్రభుత్వ చక్రాన్ని కదలిస్తూవున్న నాయకులు ప్రజాలోకాన్ని పాదల గొట్టుతూ, సుఖం, శాంతి అనేవి లేకుండా చేయటానికి అవలంభిస్తూవున్న పద్ధతులని చూస్తే, ఈజాతి అవమానంతో, దుఃఖంతో తలవంచుకోవాలసిన దుర్భరావస్థలోకి తీసుకుని వచ్చారు. ఈ నాయకుల పద్ధతులను సమర్థిస్తూ, చిన్న నాయకులు వాళ్ళకంటే రెట్టింపుతో దేశ శాంతినంతా ఎలా చిందరవందర చేస్తూవున్నది చూస్తే జాతి ఎలాటి యమయాతనకు లోను కావలసి వచ్చింది ఇక చెప్పాలా?...

ఆ పెద్ద నాయకులు, ఈ చిన్న నాయకులూ తమ జాతీయుల జన్మ హక్కులని మన్నుపాలు చేయటంతో తృప్తిపడ్డారా? చుట్టు ప్రక్కల దేశాల మీద పడ్డారు. ఆ దేశాల ప్రజా లోకాన్ని అష్ట కష్టాల్లో ముంచివేస్తూ వున్నారు. శాంతి, క్షేమం అనేది ప్రజకులేదు. అంతా చిచ్చు. ఈ "చిచ్చు" ను తెచ్చిపెట్టటం ఎంతో ఘన కార్యమని జయ జయ నాదాలు చేస్తూ ఆనందిస్తూ వున్నారు.

ఇలా లోకానికి చిచ్చుపెట్టటం జర్మను జాతి పునోభివృద్ధికి శుభోదయం అని నాయకులు భ్రమపడుతూ వున్నారు. అదంతా భ్రమకాక మరేమవుతుంది? ధర్మం పోయింది. న్యాయం పోయింది. అతిథి సత్కారంలో అనాదినుంచి పేరుగాంచిన మనవాళ్ళ అతిథి ధర్మమూ మాయమైపోయింది. సత్యం అనేది కలికానికైనా కనపడకుండా అదృశ్యమైపోయింది.........

దాని మూలాన ఈ రోజుల్లో మనమెంత నీచస్థితికి రావాలసి వచ్చిందో — ఆ దృశ్యాలని కళ్ళార చూస్తూవుంటే, ప్రజల ఆర్తనాదాన్ని వింటూవుంటే దుఃఖించక మరేం చేయగలుగుతాం? కాని అలా వుండిపోతే సరిపోతుందా? జాతి భవిష్యత్తు ఏమయిపోతుందో ఒక్క నిమిషం తాపీగా ఆలోచించటం జర్మను పౌరులం అనుకన్న మావంటి వాళ్ళకు అత్యవసరమనే సంగతి మరచిపోవ వీలుంటుందా?......

న్యాయ శాస్త్రాన్నిబట్టీ, మరి ఇతర ధర్మశాస్త్రాలనిబట్టీ, ఈ లోకంలో మితం అనేది ఒకటి వుంది. ఆ తెర చాటున దాక్కుంటూ, ఈ తెర వెనుక తప్పుకుంటూ, వాళ్ళ పేరుతో వీళ్ళ పేరుతో అత్యాచారాలని చేస్తూ, జాతి భాగ్యవిధాతలమని పేరు పెట్టుకున్నారు నాయకులంతా.

ఆ నాయకుల చర్యలని ప్రతిఘటించటానికి ముందంజ వేసినవాళ్ళంతా వాళ్ళ దృష్టిలో రాజద్రోహులు. దేశద్రోహులు. స్వామి ద్రోహులు. జర్మను జాతికి, జర్మను సంస్కృతికి పరమ శత్రువులు. ఇదొక కొత్త వేదాంతం. ఈ వేదాంతాన్ని సమర్థించటానికి వాళ్ళు అవలంబిస్తూవున్న అత్యాచారాలని చెప్పలేను.

ఈ కొత్త వేదాంతాన్ని ప్రారంభంలోనే అరికట్టక పోతిమా, అది ఏ యే పెడదోవల్లోకి మన జాతిని తీసుకుని వెళ్లుతూ మన కీర్తి ప్రతిష్ఠలని పటాపంచలం చేస్తోందో...ఆ సంగతి తలిస్తేనా? నాయకులకు ఈ సంగతిని వోపికతో, ప్రశాంతంగా ఆలోచించటానికి వీలుంటే ఇలా క్రిందికి బర బర పడిపోతామా!......

ఇలాటి భావాలు నావంటి వాళ్లలో కలగటమూ వాటిని నాకు చేదోడు వాదోడుగా నున్న శిష్యకోటికి బోధించటమూ, నిప్పుతో చెరలాటం అనే సంగతి నాకు బాగా తెలుసు. దేశం అసహాయస్థితిలోకి వచ్చింది. ప్రజాకోటి ముందు వెనుకలు తెలుసుకోలేక, ఈ అసహాయ స్థితిలో వుక్కిరిబిక్కిరి అయిపోతున్నారు. ఆ రహస్యం అందరికీ తెలుసు. కాని నోరు పెగిల్చి చెప్పటానికి ఎవళ్లకు దమ్ములున్నాయి ఈ విషమావస్థలో!

నా విద్యార్థులను కలుసుకున్నప్పుడు వాళ్ళకు బోధించింది ఈ రహస్యాన్నే. ఈ రహస్యాన్నే పెద్దలు, పిన్నలు తెలుసుకుని, ఈ అయోమయావస్థ నుంచి బయటపడటానికి శాయ శక్తులా సేవ చేయాలసిన ధర్మము వాళ్ళదే అనీ విద్యార్థులకు అస్తమానమూ బోధిస్తూ వచ్చాను......

నా విధ్యుక్త ధర్మాన్ని యిలా నిర్వర్తిస్తూవున్నందుకు ప్రభుత్వం నన్ను నా ఆచార్య పదవినుంచి తొలగించింది. నా డాక్టరు బిరుదాన్ని వూడదీసింది. నేరస్థుల్లో అధమాధముణ్ణిగా చూస్తున్నది. కాని ఈ నాటకానికంతా భయపడుతానని అనుకుంటున్నది...... పై లాంఛనాలు పోయినా, నా వ్యక్తిత్వాన్ని, నా విధ్యుక్త ధర్మాన్ని అపహరించటానికి ఎవళ్ళతరమవుతుంది !

ఈ విశ్వాసమే నాకు తోడునీడగా వుంటుంది. నా కర్తవ్యాన్ని సర్వావస్థల్లో తెలుపుతూ వుంటుంది......

భగవంతుడు అనే ఆయన వున్నాడు. భగవానుడే ఈ నాటకాన్నంతా వెయ్యి కళ్లతో చూస్తూ వున్నాడు. ఆయన శక్తి మానవాతీతం. ప్రజాకోటిని ఈ ప్రళయాన్నుంచి కాపాడే బాధ్యతి ఆయనదే. తగిన సమయాన్నే కలుగజేసుకుని ఈ దారుణావస్థనుంచి ఈ జాతినేకాదు, ఈ ఖండాన్నేకాదు సమస్త దేశాలనూ, సమస్త జాతులనూ తన మ్మార్గాన్నే నడపగలడు. అంతవరకు మా వంటి మానవమాత్రులు ఈ ఆపత్కాలాన చేయాలసిన సేవను మా శక్త్యానుసారం చేసి తీరాలి.

"నీ విధ్యుక్త ధర్మం ఏమిటో దాన్నే స్పష్టంగా తెలుసుకో. దానికి అనుగుణ్యంగా చేయాలసిన సేవను తటపటాయించక చేయటం నీ ధర్మ" మన్న సంగతి మరచిపోవద్దు. ఇక జర్మను జాతియొక్క భవిష్యత్తుసంగతా ? నీ విధ్యుక్తి ధర్మాన్ని నువ్వు ఎలా నిర్వర్తిస్తూ వున్నావో, దానిమీదనే జయము ఆధారపడివున్నదనే రహస్యాన్నే అణుమాత్రమూ మరచిపోవద్దు.

ఈ ధర్మసూత్రాలని మన దేశీయుడు, రాజకీయవేత్త, కవితా కుమారుడు, ఫిస్టే నూరేళ్ల క్రిందట బోధించాడు. ఆ వాక్యాలనే ఆచరణలో పెట్టటానికే నా శిష్యులు ముందంజ వేశారు. నేనూ వాళ్లకు చేదోడువాదోడుగా వున్నాను. ఇదే నా తప్పు.

మీ దృష్టిలో నేను చేసిన "రాజద్రోహం" ఇదే. దానికి మీరు ఏ శిక్ష వేసినా దానిని సంతోషపూర్వకంగా అనుభవించటానికి నా శిష్యులతో నేనూ సిద్ధంగా వున్నాను......"

◆ ◆ ◆

ఇక తరువాత సంగతి చెప్పటం అనవసరం కదూ ! న్యాయస్థానంవారు వాళ్ళ పనిని వాళ్లు నిర్వర్తించారు. ఆ సంగతి కప్పి వుంచటానికి ప్రభుత్వం ఎంత ప్రయత్నించినా అది దాగుతుందా ?......

హాన్స్, సోఫీ, క్రిస్టఫర్ మరణాలను గురించి ప్రచురించిన సంఘటన జరిగిపోయిన మరికొంత కాలానికి పత్రికల్లో ఈ క్రిందివార్తను ప్రచురించారు !

"రాజద్రోహం క్రింద విచారించబడి ఈ క్రింది వారికి వురిశిక్ష విధించబడ్డది !

విల్లిగ్రాఫ్

ప్రొఫెసర్ కూర్ట్‌హూబర్

అలెగ్జాండర్ స్మోరెల్.

ఆ శిక్ష ప్రకారం నేరస్థులు వెంటనే వురితీయబడ్డారు."

◆ ◆ ◆

ఆ త్యాగమూర్తి ప్రొఫెసర్ హూబర్ చూపెట్టిన ధర్మ మార్గాన్ని, ఈ విద్యార్థి వీరులు అనుసరించిన దోవని అనుసరిస్తూ విద్యార్థులు తండోపతండంగా ఈ సత్యాగ్రహోద్యమాన్ని నడపటానికి ముందుకు వచ్చారు. ఇంతవరకు ఇలాటి పనుల్లో కలుగచేసుకొనటానికి తటపటాయిస్తూవున్న యూనివర్సిటీ ప్రొఫెసర్లూ ముందంజవేశారు.

దేశ చరిత్ర పూర్తిగా మారిపోయింది. దీనికంతా కారణభూతులయిన విద్యార్థి వీరులనూ, వాళ్ళకు చేదోడు వాదోడుగానున్న ప్రొఫెసర్లని, ఇతర స్వాతంత్ర్య వీరులను, వీర మాతలనూ నేటి జర్మను జాతి ఎలామరచిపోగలుగుతుంది ? ఆ గాధలను చదువుతూవున్న మనమూ వాళ్ళ త్యాగాన్ని ఎలా మరచిపోగలుగుతాం ?

సర్వేపై సుఖినస్సంతు,
సర్వే సంతు నిరామయాః
సర్వే భద్రాణి పశ్యంతు,
నకశ్చిత్ దుఃఖ భాగ్భవేత్ ॥

(సమాప్తం)

# జీవన పరిణామము

శ్రీ గాడేపల్లి శంకరం

గ్రామ పునర్నిర్మాణ మంటే - ఆర్థికాభివృద్ధి కార్యక్రమాలు అమలు పెట్టటంతో సరిపోదు. గ్రామం పరిశుభ్ర పరచటంతో అసలే తీరిపోదు. సాంఘికంగా విప్లవాత్మకమైన పరిణామాన్ని తీసుకురావాలి. సంఘములోను సంఘములోని వ్యక్తులలోను పరివర్తన తీసుకురావాలి.

అట్లాగని సనాతన వ్యవస్థలను - పద్ధతులను రూపుమాపటం కాదు. అధునాతన పరిస్థితులకు అనుగుణ్యంగా జీవన పరిణామాన్ని వృద్ధిచేయాలి.

ప్రభుత్వ సహాయంతోను, సలహాలతోను, కావలసినంత డబ్బు సంపాదించటం ప్రజలు నేర్చియుండవచ్చు. వట్టి డబ్బు సంపాదించినంత మాత్రాన సరిపోదు-సంపాదించిన డబ్బును సద్వినియోగంచేసి సమస్తమైన సౌకర్యాలు_సదుపాయాలు పొందుతూ- ఉన్నత స్థాయిని జీవించటం నేర్చుకోవాలి. లక్షలు ఖర్చుపెట్టినా, మనం చేసుకున్న సౌకర్యాలు-అనుభవించటం ప్రజలకి తెలియనప్పుడు దానివల్ల ప్రయోజనం యేమిటి ? అధునాతన పద్ధతులతో ఏర్పాటు చేసిన అన్ని హంగులూ అనుభవించటం నేర్చుకోవాలి. ఊళ్ళోవున్న ఆసుపత్రినీ-శిశు సంరక్షణాలయాన్నీ-పాఠశాలనీ - పఠన మందిరాన్నీ-సహకార బ్యాంకునీ, పంచాయితీబోర్డునీ - ఉపయోగించుకోవడమే కాకుండా_నిర్మించుకున్న రోడ్లు, పార్కులు-బావులు-చెరువులు-రచ్చ సావిళ్ళు-రహదారీ బంగళాలు పరిశుభ్రంగా వుంచుకోవాలి. పోస్టాఫీసునీ-టెలిఫోను సౌకర్యాలనీ - ఉపయోగించటం తెలుసుకోవడమే కాకుండా దాని విధి విధానాలుకూడా ప్రజలకి తెలిసిన నాడు అవి సక్రమంగా పనిచేస్తాయి. రైలు ప్రయాణమూ అంతే వాటికి చెందిన రూల్సు రెగ్యులేషన్సు ప్రజలకు తెలిసి వుండాలి. అట్లా తెలిసివున్న నాడు_వాటి, నియతి నియమాలను-ప్రజలు పాటిస్తారు. ఇతరులు పాటించేటట్టు కూడా చూస్తారు. చాలామందికి ఈ విషయాలు తెలియవు. టెలిఫోనులో సరిగ్గా మాట్లాడటం తెలియదు. విద్యాధికుల్లో కొందరికి టెలిఫోను ముట్టుకోవటమే చేతకాదు. ఇక రైలు ప్రయాణంలోని రూల్సుగాని - పోస్టాఫీసువారి పద్ధతులుగాని ఎవ్వరికీ తెలియవు -, రైల్వే అధికారులో - పోస్టాఫీసువారో చెప్పాలి. ఇట్లాంటి పరాధీనత-విద్యాధికుల్లోకూడ వుందంటే-ఇక పల్లె ప్రజల మాట చెప్పాలా ! చాలా మందికి ఆధునిక పరికరాల్ని ఉపయోగించటం చేతకాదు. తెలియక ఎన్నో తప్పులు చేస్తారు. పబ్లిక్ సంస్థలను అనుభవించటంలోను, సౌకర్యాలను ఉపయోగించుకోవడంలోను క్రమ పద్ధతి నేర్చుకోవాలి. వాటి, నియతి నియమాలను పాటించాలి. అప్పుడు వ్యక్తి సౌఖ్యపడుతాడు. సంఘము బాగుపడుతుంది. అప్పుడు జీవిత విధానము హెచ్చు స్థాయిలో నడుస్తుంది.

జీవితం ఉన్నత స్థాయిలో నడుపుకుందామని ఆ సక్తి మనలో ఎప్పుడు కలుగుతుందో - అప్పుడు మనలో కోరికలు పుట్టుకొస్తాయి. ఆ కోరికలను సంతృప్తి పరచటానికి ప్రయత్నిస్తాము. మనలో కలిగే ఈ కోరికలు ఉన్నతంగాను, ఉదాత్తమైనవిగాను ఉండాలి. అంటే ఏమిటి ? తనకు సౌఖ్యాన్ని-ఇతరులకు హానికలుగ చేసేవిగా వుండకూడదు. తనకు ఇతరులకు సౌఖ్యము-ఆనందము కలుగ చేసేవిగానైనా

వుండాలి - లేదా - తనకు ఆనంద మిచ్చినా - ఇతరులకు హానికరముగా మాత్రము పరిణమించకుండా వుండాలి. అప్పుడే మన జీవితం ఉన్నత స్థాయిని నడుస్తుందన్న మాట — ఆనాడు మన జీవన పరిమాణం హెచ్చుతుందన్నమాట.

మన ఇంటినీ - వంటినీ శుభ్రం చేసుకొని - మన పల్లెనీ - పరిసరాల్నీ శుద్ధముగా వుంచుకొని - మనం శ్రమపడి సంపాదించిన సొమ్మును బాంకులో దాచుకొని - పొదుపుగా వాడుకుంటూ - పబ్లిక్ సంస్థలను ఉచిత రీతిని ఉపయోగిస్తూ - పంచాయితీని గౌరవిస్తూ - పాఠశాలలకు పిల్లలను పంపి - పఠన మందిరమున విజ్ఞాన సముపార్జన చేసి - రేడియో - టెలిఫోను - సినీమాలవంటి ఆధునిక పరికరముల నుపయోగించు విధానము తెలిసియుండి - రైళ్ళు - రహదార్ల సౌకర్యాలను — తంతి తపాలా ఆఫీసులను — సక్రమంగా ఉపయోగించటం తెలిసియుంటే మన జీవితం ఉన్నత స్థాయిని నడుస్తోందన్న మాటే! మన జీవన పరిమాణం హెచ్చిందన్న మాటే!

ఆధునిక జీవిత విధానమువైపు గ్రామస్థుని దృక్పథం మళ్ళేటట్టు చెయ్యటం — గ్రామస్థునిలో సుఖ జీవనానికి ఆసక్తిని కల్గించటం — అతనిలో కలిగే నూతన ఆశయాలను తృప్తిపరచే మార్గాలు — ఆ మార్గాలకు కావలసిన డబ్బును సంపాదించే విధానాలు — ప్రభుత్వము — ప్రజా సేవకులు చేయవలసిన పని.

దేశాన్ని యావత్తు దరిద్రదేవత ఆక్రమించియున్నమాట వాస్తవమే. ఈ దరిద్రానికి తోడు, ప్రజలలో బద్ధకము ప్రబలియున్నమాట నిజమే. ఈ బద్ధకాన్ని తొలగిస్తే ప్రజలు శ్రద్ధగా పనిచేయడం నేర్చుకుంటారు. ఆర్థికాభివృద్ధి జరుగుతుంది. కాని అంత మాత్రాన లాభంలేదు. అంతటితో గ్రామ పునర్నిర్మాణము ముగియదు. జీవిత విధానంలో — వ్యక్తిగత దృక్పథములో పరివర్తన తీసుకురావాలి. కాలం శరవేగంతో ముందుకు పరుగెడుతోంది. ప్రపంచమంతా అతి సన్నిహిత మవుతోంది. కొత్త కొత్త సమస్యలు ఉత్పన్న మవుతున్నాయి. క్రొంగ్రొత్త జీవిత విధానము తొంగిచూస్తోంది కాలానికీ పరిస్థితులకీ ఎదురీదడము. వాటిని మానవుడు అనుసరించి పోతేనే సుఖాన్ని పొందుతాడు - లేకపోతే కష్టాల పాలవుతాడు. ఇది నగ్న సత్యం. బూజు పట్టిపోయిన పాతకాలపు ఆచార వ్యవహారాలనే ఇంకా అంటిపెట్టుకు కూర్చుంటే — మనకి అధోగతి తప్పదు. పాత వాటిని పూర్తిగా తగులబెట్టనక్కర్లేదు. బూజు దులిపి — క్రొత్తరంగులు వేసి — ఆకర్షణీయంగా చేసుకుంటే చాలు. అసలు పాత కొత్తల కలయికయే అభిలషణీయంకూడాను. మార్పు ఎప్పుడూ క్రమంగాను, స్వతంత్రముగను జరుగుటయే మంచిది. ఒక్క రాత్రిలో జరుగదు జరుగ కూడదుకూడా.

డబ్బున్నంత మాత్రాన మన జీవన పరిమాణం హెచ్చిందనుకోవడం వెఱ్ఱితనమే. అలాగే దరిద్రులమైనంత మాత్రంచేత మన జీవన పరిమాణం తక్కువైందని తలచటమూ తెలివి తక్కువే. మనం సంపాదించిన డబ్బును ఏ విధంగా ఖర్చు పెడుతున్నామో మన జీవిత విధానం ఎట్లావుందో దానినిబట్టి మన జీవన పరిమాణంయొక్క హెచ్చు తగ్గులు నిర్ణయించవలసివుంది. జీవితం ఉదాత్తముగాను, ఉన్నతాశయములతోను, విజ్ఞతతోను నడిపించుకొనిననాడు - మనం సాటి దేశాలతో సభ్య మానవులవలె, సంచరించినాడు, మన జీవిత పరిమాణము, హెచ్చు స్థాయిలో నడుస్తూన్నదనే చెప్పవచ్చు.

వ్యక్తి ఉన్నదానిలో ఉన్నంత పొదుపు నేర్చుకుంటున్నాడా? రూపాయికి దమ్మిడీ అయినా నిల్వచేసుకోగల్గుతున్నాడా? ఆరోగ్యంగా జీవిస్తున్నాడా? శ్రమపడి సంపాదిస్తున్నాడా? ఉన్నతాశయాల, క్రమ పద్ధతిన జీవితం నడుపుతున్నాడా, ఇంటగల స్త్రీకి ఎటువంటి స్థానం యిచ్చాడు? పిల్లలను ఏ విధంగా తర్ఫీదు చేస్తున్నాడు? — తెలివితేటలు, పనిపాటలు ఎట్లావున్నాయి? విశ్రాంతి కాలాన్ని ఎట్లా వినియోగిస్తున్నాడు? విధి విరామా

లతో కృషి ఆ గ్రామ ప్రజలందరూ చేసుకుంటున్నారా? ఆధునిక సంపత్తితోగూడిన అన్ని సౌకర్యాలూ ఆ గ్రామ ప్రజలు అనుభవించటం నేర్చుకున్నారా? సత్యము, ధర్మముతో కూడిన సత్ప్రవర్తన ఆ పల్లెలో కానవస్తుందా? ఇవీ ప్రశ్నలు. ఈ ప్రశ్నలకు సరియైన సమాధానం వస్తే ఆ ప్రజల జీవన పరిమాణం ఉన్నత స్థాయిలో నడుస్తోందనే చెప్పవచ్చు.

ఇల్లు వాకిలి పరిశుభ్రంగా వుండాలి. గాలి వెల్తురు బాహాటంగా రావాలి. గుడిశయైనా గుంభనంగా కట్టుకోవాలి. ఇల్లు పొగచూరిపోకూడదు. ఇంట్లోని వస్తువులు క్రమ పద్ధతిని సర్దినట్టుండాలి. చిందరవందరిగా పారేసినట్టు వుండకూడదు. అందమైన బొమ్మలు, అర్ధణా ఖరీదువైనాసరే, గోడలకి వ్రేలాడకట్టివుండాలి. ఇంట్లోని-ఇల్లాలు_ఇల్లాలికి చెందిన పిల్లలు_ఇతర బంధు వర్గముకూడా, శుభ్రంగా, స్నానంచేసి, ప్రతిరోజా ఉతికి ఆరవేసిన బట్టలువేసుకొని, (అవి చినిగి అతుకులువేసిన పాతవైనాసరే, ఉతికినవైయుండాలి) తల దువ్వుకొని, కల కల లాడుతూ కనబడాలి. యుక్తవయస్సు వచ్చిన ప్రతి స్త్రీ పురుషుడు ఆ ఇంట్లో ఉత్సాహంగా మసలుకుంటూ కష్టించి పని చెయ్యాలి. ఇంటి చుట్టూ, మురికిని చేరనియ్యకూడదు _ మురుగుదొడ్డిని మలినంగా వుంచకూడదు. పుస్తకాలు, వార్తా పత్రికలు చదువుతూవుండాలి. సహకార సంస్థలోనూ, సాంఘిక సేవా సంస్థలోనూ సభ్యులై వుండాలి. డబ్బును బాంకులో దాచుకోవాలి. జీవితాన్ని ఇన్సూరు చెయ్యాలి. పుష్టి కరమైనవీ, ఆరోగ్యకరమైనవీ, ఆహార పదార్థాలు, (అవి ఎంత తక్కువ విలువగలవైనా) తింటూ ఆటలతోను, పాటలతోను కాలక్షేపం చేసుకోవాలి. పాఠశాలలకు పిల్లలూ, పరిశ్రమలకు పెద్దలూ వెడుతూ వుండాలి.

పాటుపడి సంపాదించటానికి యుక్తవయస్సు వచ్చిన వారందరూ (స్త్రీలు పురుషులు కూడ) పోతూ వుండాలి. పఠనమందిరాలను, శిశు సంరక్షణాలయాలను, ఆసుపత్రిని, రేడియోను, తంతి తపాలా సౌకర్యాలనూ ఉపయోగించటం తెలిసి వుండాలి. పంచాయితీని, పబ్లికు సంస్థలనీ తమవిగా భావించి గౌరవించాలి. వీటితో వ్యవహరించే విధి విధానాలు తెలుసుకొని వుండాలి. ఇవన్నీ జీవిత పరిమాణాన్ని ఉన్నత స్థాయికి తెచ్చే అలవాట్లే. ఇవి గ్రామీణులు అలవరచుకోవాలి. అట్లా వుంటున్నారా? లేదు. ఖరీదుగల బట్టలే వేస్తున్నారు. కొందరు. భయంకరమైన రంగులు బాధ కలిగించే వేషాలు. భవనాలలోనే నివసిస్తున్నారు. గాలి వెల్తురు రాని భవనాలు. ఏడాదికోసారియైనా సున్నం కొట్టని కొంపలూ. కొందరి బట్టలు శుభ్రంగా వుండవు సరి కదా_ రోజూ స్నానంకూడా చేయరు. చింపిరి జుట్టులు, చీమిడి ముక్కులు, చినిగి మాసిన దుస్తులు, చెమట కంపుకొట్టుకుంటూ వుంటారు. కోళ్ళగూడు వంటి కొంపల్లోను, నక్కల బొరియలవంటి గుడిశల్లోను, నివసిస్తున్నారు. ఇది ఏమని అడిగితే_దరిద్రులమంటారు; పేదోళ్ళమంటారు. పేదరికానికీ శుభ్రంగా వుండటానికీ సంబంధములేదు. బద్ధకంతో అశ్రద్ధ, అశ్రద్ధతో అనారోగ్యం-అనారోగ్యంతో_నిరుద్యోగం_నిరుద్యోగంతో దరిద్రం సంక్రమిస్తున్నాయి. వళ్ళువంచి పనిచేసే వాళ్లు తక్కువ. అన్నం కలిపి నోటికందిస్తే తిందామనుకునేవాళ్లు ఎక్కువ. బద్ధకంతోటే నిరాశ నిస్పృహ_వైరాగ్య భావంకూడా కలుగుతాయి. బ్రహ్మాండాలు బ్రద్దలవుతున్నా వీళ్ళు పట్టించుకోరు. తెలిసికోటానికి ప్రయత్నించరు. మాటకుముందు గ్రహచారమనీ, చదువుకున్నా కామందులకిగాని, మాకేటి తెలుస్తదనీ, ఉపేక్షిస్తున్నారు, పిల్లలు పెంటకుప్పమీద, ఇల్లాలు పేడకుప్పమీద రోగంవచ్చినా ప్రాణం పోతున్నా, కళ్లప్పగించి కదలేంవలిసిందే. "మందులేకనా, మాక్కులేకనా ఆయుర్దాయం మూడింది, భగవంతుడి దయలేదని" సమాధానపడుతారు. అవిద్య, అజ్ఞానం, సాంఘిక పరిజ్ఞాన శూన్యత, సహకార భావాలేమి కక్షలు, కార్పణ్యాలు కొట్లాటలు, పోట్లాటలు కోర్టు కెక్కడాలు మిగిలినాయి.

బక్క చిక్కిన పేగులతో, కత్తివాటేసినా నెత్తురు చిమ్మని మొగాలతో, బానిస పీనుగులై, బ్రతుకులు ఈడుస్తున్నారు. సోమరిపోతులతోటీ స్వార్థ పరుల తోటీ, దరిద్ర దేవత తాండవిస్తోంది.

దరిద్రమంటే డబ్బు లేకపోవడం కాదు. ఉన్న డబ్బును ఉపయోగించటం చేతకాకపోవటం. శరీర పరిశ్రమ చేయక సోమరితనంగా కాలం గడపటం, ఒకడు సంపాదించిన కూడను పదిమంది కూర్చుని తినడం. లెక్కలేకుండా పిల్లల్ని కనడం - జనాభా పెరిగిపోయిందని, ఖజానాకు డబ్బు రావటంలేదని ప్రభుత్వం గోల పెట్టడం.

ఈ పరిస్థితి మారాలి. వ్యక్తుల్లో పరివర్తన తీసుకు రావాలి. ప్రతి వ్యక్తికీ పని కల్పించాలి. వారిచేత పని చేయించాలి. వారికి చేతినిండా పని, కడుపు నిండా తిండి వుంటే వారిలో ఆసక్తి కలుగుతుంది. ఆశలు జనిస్తాయి. ఉన్నతాశయాలతో జీవిద్దామనే ఉత్సాహం పుట్టుతుంది. అప్పుడు జీవన పరిమాణం హెచ్చుతుంది.




ఆమెను చూచి చాలా దినాలైంది. నా కాలేజీ చదువురోజుల్లో ప్రతినిత్యం మా బస్సు స్టాపింగ్ వద్ద తారసపడడం మామూలు. సన్నగా, నాజుగ్గావుండి - చేతుల్లో పుస్తకాలు వూపుకుంటు ఉల్లాసంగా కనిపించే ఆమె నాకు పరిచయమే. కాని నేను నా మెడిసిన్ మూడవ సంవత్సరానికి వచ్చేసరికి - ఆమె కనుపించడం మానివేసింది. కొన్ని దినాల వరకూ ఆమె వస్తుందనే ఆశ నాలో అత్యంత ఆశాజనకంగా వున్నా, క్రమేపీ, అది సబ్బు బుడగలలా విచ్చిపోయింది. కొన్ని దినాలకు ఆమెనే మరచిపోయాను.

కాలేజీ చదువు పరిపూర్తి చేయడం, సొంతంగా అక్కడే డిస్పెన్సరీ ఓపన్ చేయడం రెండూ ఏక కాలంలో జరిగిపోయాయి. వృత్తిలోవున్న ఆసక్తి, నన్ను ఇంకా వైద్య సదుపాయాలకు తగిన దోహదం చేయడానికి పరిశోధనలు చేయమని నా మనస్సు ప్రోద్బలించింది. ఆసక్తివల్లనైతేనేం- పరోపకారార్థమైతేనేం, నా విధిగా పరిశోధనలు - రాత్రిపూట నా డిస్పెన్సరీలోనే ప్రారంభించాను.

అ రోజు కటికి చీకటిగా వుంది. నా డిస్పెన్సరీ తలుపులు దగ్గరకుమూసి మైక్రాస్కోపులో నా ఎక్సుపరమెంట్ రిజల్టు చూస్తున్నాను. గాఢాంధకారంలా వున్న ఆ చీకట్లో అత్యావసరం వుంటేతప్ప ఏ వ్యక్తి ఇవేళకు వస్తాడంటే నమ్మలేము.

మంచి నిశిత ఆలోచనలో వున్న నాకు గది తలుపులు మీాద టక్! టక్ మని కొట్టడం వినిపించింది. పూర్తిగా పనిలో నిమగ్నుడైయున్నందున యాధాలాపంగా 'లోపలికి రండి!' అన్నాను. ఆ తరువాత తిరిగి నా పనిలో నిమగ్నుడయ్యాను. మెత్తని పాదాల సవ్వడి, వినిపించింది. నా ఎదుటి కుర్చీమీాద ఎవరో వ్యక్తి ఉపవిష్టులైనట్లు శబ్దించింది. పనిలో వుండి కూడా ఎదురుగా వున్న కుర్చీ వంక చూచాను. తెల్లటి పాము కుసుములాంటి బట్టలు, వంటినిండా చీర, ముంచేతికి నల్ల గాజులు, వుండి ముఖంమీాదికి మేలి ముసుగు జారి వుండి, కూర్చున్న అగంన కనిపించింది. ఆమె ఎవరో కాదు, నాలుగేళ్ల క్రిందట పరిచయస్తురాలు - ఆమె.

ఎదురుగా కూర్చున్న నాకు ఆమె మో

ములో అంతకు ముందున్న అపూర్వ కాంతులేం స్పష్టంగా కనిపించలేదు. కన్నుల నుండి అశ్రుధారలు కారడం క్రింద పడడం బొట బొటమని వినిపించింది గాని అశ్రుధారల ప్రవాహపు తీరు, విస్పష్టంగా పరికించ వీలుకాలేదు. మూగనోము పట్టి కూర్చున్న స్వాములవారు లావున్న నన్ను ఆమె ముందు పలకరించింది.

"డాక్టరుగారు ! మీ సహాయం అత్యవసరం! తప్పక మీరు సహాయపడాలి!"

"నేనా! యిప్పుడు! అందులో సగం రాత్రప్పుడా !" అన్నాను.

"అవును డాక్టరు! మీరునాకు పూర్వ పరిచయస్థులు. ఇంకెవ్వరు నా అవసరం తీర్చలేరు. ప్రస్తుతం మావారు అతిప్రమాద దశలో వున్నారు. మీరు వెళ్లి వారికి వైద్యంచేసి రావాలి"

"మీరు వెళ్ళి వైద్యం చేయమంటున్నారేం? మీరు అక్కడలేరా? అక్కడికి రారా!"

"కొన్ని కారణాలవల్ల రాలేను డాక్టర్. మావారు, నన్ను విడిచి వుండలేనివారు. కాని పరిస్థితుల ప్రాబల్యంవల్ల విడిచిపోవలసి వచ్చింది. నేను అక్కడికి రాను, మీరు వెళ్ళిరండి!"

"మీరు రారా! రాకుంటే ఆయనపేరు అడ్రస్!"

"మావారిపేరు ఆపేటలోఎవరిని అడిగి చూడమన్నా వారి భవంతి చూపుతారు! వారి పేరు రామారావుగారు."

"ఇంటి పేరు!"

"నడిమింటివారు!"

"మీ రెందుకు రాలేరు!"

"చాలా కారణాలున్నాయి డాక్టర్! నేను అక్కడ లేకుండా వుంటే కొంతైనా బాగు పడతాడను కొన్నాను. కాని వారింకా నీచ దశలోనికి దిగజారిపోయారు."

"సరే! మీరెక్కడుంటారు!"

"నేను మళ్ళా ఓ గంటలోపల వస్తాను డాక్టరు! డబ్బు ఇవ్వనని భయపడకండి!" అన్నది. సరే! అని నా హాండ్ బ్యాగు సర్దుతున్నాను గది తలుపులు దగ్గర చేర వేసుకొన్నట్లు శబ్దం వచ్చింది. తిరిగి చూసే సరికి అక్కడ ఆమె లేదు.

అన్నీ సర్దుకొని, డిస్పెన్సరీకి తాళం తగిలించి, ఆ చలిలోనే ఆమె యిచ్చిన అడ్రస్ వెతుక్కుంటూ సైకిల్ మీద బయలు దేరాను.

ఆమె చెప్పినట్లు రామారావు వుండేది రెండంతస్థుల మేడ. మేడలో ఏ కోశాన దీపపు కాంతి కనిపించలేదు. గాఢాంధకారం - లోకంలోని - నల్లని

ముసుగు అంతా అక్కడే వాలిందా అన్నట్లు గోచరించింది. ఏవ్యక్తి అచ్చటికి క్రితం పూర్వం అడుగు పెట్టకుంటే ఇప్పు డున్న పరిస్థితుల్లో తలా తోకా ఎక్కడో కనుక్కోవడం కష్టం. పదిహేను నిమి షాలు కొట్టుకుంటే ఇంటి పనిమనిషి వచ్చి తలుపు తీసింది.

"మీ అయ్యగారున్నారా!" అన్నాను.

"వున్నారు. మేడమీద రెండవగదిలో" అంది.

లైటువేసి ముందుకు దారి తీసింది. ఇంటి వాతావరణం విరాగం చెందిన - వాతావరణంలో కనిపించింది. నేనువెళ్లి చూచేసరికి రామారావు - పక్క మీద లేదు. క్రింద స్పృహ లేకుండా పడున్నాడు. తప్ప త్రాగి - మైకంలోవున్న ఆ వ్యక్తిని చూచింది పని మనిషి. రెండడుగులు వెనక్కు వేసింది. నేనే ఏలాగో ఆలాగ అతనిని మంచంమీదకు చేరవేశాను. గంటకు పైగా శైత్యోపచారాలు చేసిన మీదట రామారావుకు కొంచం తెలి వొచ్చింది. పక్కన కూర్చున్న నన్ను చూచాడు. "డాక్టరుగారా! మీ రెవ రండీ! ఏలా వచ్చారు! మీకు నేను కబురు పంపలేదే!" అంటూ కొంచం ఆశ్చర్యపడ్డారు!"

"రామారావుగారు! మీ ఆరోగ్యం మీ క్షేమం మీరు చూసుకోలేక పోయినా ఆమెకు కావాలి! మీ సుఖమే ఆమె కాంక్షించేదని!" అన్నాను.

"ఆమే! ఎవరండీ?"

"మీ ఆవిడే! మీ భార్య నన్ను పంపింది ఆవిడే నండి! కలత చెందక రేపైనా ఆమెను పిలిపించు కొంటే ధన్యులౌతారు!!" అన్నాను.

"నా భార్య! నా భార్య! మాధవి! అహా! ఆహా! మీకు కనిపించిందా! ఆవిడ నా ప్రస్తుత స్థితికి కారణం. నన్ను విడిపించి ఒంటరిగా పరలోకం యాత్ర చేయడమే నా దుస్థితికి కారణం. పుణ్యాత్మురాలు ఈ పాపిని అనుభవించ మంటు వెళ్లిపోయిందేమో! నే నెపుడు ఆమెని కలుస్తానా అని వువ్విళ్యూరుతూన్నాను! డాక్టర్ నిజం చెపుతున్నారా! అబద్ధం చెప్పుతున్నారా! స్వర్గానికి వెళ్లిన ఆమె తిరిగి వచ్చిందా! అబద్ధం ఆడడం నేర్చుకున్నట్లు! "లేదు!" అని, కొంచం సేపటికి చంటి పిల్లాడిలా ఎక్కి ఎక్కి ఏడ్వ నారంభించాడు. నిజంగా అతనికి మతి స్థిమితం తప్పిందేమో అనిపించింది. అపురూపవతైన భార్య కంటికి కనుపించకుంటే అలా, మన స్థిమితం లేదా! అనిపించింది. అతనికి చికిత్సచేసి నా డిస్పెన్సరీ చేరాను.

తలుపులు తెరిచి ఎదురుగావున్న టేబులు ముందు కూలబడి "నిజంగా ఆమె చనిపోయిందా? చనిపోయినావిడ నాకేలా కనిపించింది? అతనికి మనస్థిమితం లేదేమో!" అంటూ ఆలోచనలో మునిగిపోయాను. మువ్వలందెల గల్లు గుల్లుమని వినిపించింది. ఎదురుగా తిరిగి ఆమె నిలిచి వుంది. ఈ సారి ఆమె మోములో సంతోషంస్పష్టంగా కనిపించింది.

"థాంక్సు డాక్టర్! మావారికి మీరు చేసిన ఉపకారానికి చాలా కృతజ్ఞురాలిని, ఇదిగోనండి మీ ఫీజ్ క్రింద ఈ బహుమానం" అంటూ బంగారు చేతిగాజు బల్ల మీద పెట్టింది. నాకు ఆమె చేతులు కనిపించలేను.

"మరి మీవారు! మీరు చనిపోయినట్లు ....." ఇంకా నా మాటలు సంపూర్తి కాలేదు. ఎదుటి ద్వారంగుండా కాళ్లుకింద పాదాలులేని పొగమంచులాంటి తెల్లని ఆకారం-తలుపులు దాటిపోయింది. నేను నిశ్చేష్టుడినై వుండిపోయాను.

(ఆంగ్ల కథను ఆధారంగా)



# కృతి - ఆధునిక సంగీతంలో దాని స్థానము

శ్రీ జి. ఎస్. బాలసుబ్రహ్మణ్యం



జీవితమే ఈశ్వరార్చన. మనోవాక్కాయ పూర్వకంగా మానవుడు దైవానికి సమర్పియేకృతి. ఇదే హైందవ ధర్మ పరమార్థం. సంగీతం సామ వేదంలోంచి పుట్టింది. ఆ నాడు, సంగీతం పరమాశయం ఈశ్వరార్చన - కీర్తన. భగవద్భక్తులూ, భగవదంశ నిలుపుకున్న గాయకులూ, కృతికర్తలూ, తమ ఇష్టదైవాలనే కీర్తించి తరించారు. వారికి సంగీతం, భగవన్నామం కీర్తన ఒక సాధనం మాత్రమే. ౧౯ వ శతాబ్దం ఉత్తరార్థంలోనే, యీ దృక్పథంలో మార్పు వచ్చింది. అప్పటికి దాక్షిణాత్య సంగీతమూర్తిత్రయం అపారమైన సంగీత స్వర్ణవాన్ని మథించి, సంప్రదాయబద్ధమైన శాస్త్రీయ కృతులను ప్రసాదించింది. వారి అనంతరం, ఒక విధంగా నవశకం ప్రారంభమయింది. అయినా యీ నవశకానికి ఈ నవ్యసంగీతానికీ ప్రాతిపదిక వారు ప్రసాదించినదే. దాని మీదనే కృతి ఆవిర్భవించి రూపొందింది. ఆయా కృతి కర్తల భావాలను, వేదాంతార్థాలనూ, తనలో నిలుపుకుంది.

దక్షిణ భారతంలో కృతి, ప్రగతి, పశ్చిమదేశాలలో కాన్సర్ట్ సంగీతం వికాసగతికి సమాంతరంగా సాగిందనవచ్చు. కృతి కీర్తనకు ఒక విధమైన రూపాంతరం. కీర్తన పురాతనం. ఇది ఆధునికం. కీర్తన సార్థకమైన నామం - ఆ నాడు పరమాత్మ నామ సంకీర్తనకే కీర్తనను దానంచేసేవారు. అసలు హైందవమైన ప్రతి కార్యమూ, ప్రతి వాక్యమూ, ప్రతి కావ్యమూ, సర్వమూ, భగవత్సంబంధమైనదే. సంగీతం, ఈ దృష్ట్యా వీటన్నిటినీమించినది. కీర్తించడం లక్ష్యంగా కాకుండా, శ్రవణానందానికి దోహదకారిగా సంగీతాన్ని వినియోగించడం అనేది అనాడు లేదు. ఈ దృక్పథంబాగా ఇంటీవలదని చెప్పవచ్చు. కీర్తన భజనవంటిది. పదమువంటిది. అందులో సంగీతం కన్న సాహిత్యానికే ప్రాముఖ్యం హెచ్చు. దాక్షిణాత్య "దివ్య సంకీర్తనం" వంటిదే కీర్తన రూపం. భజనకూడా అట్టిదే. కీర్తన పల్లవితో ఆరంభమవుతుంది. తరువాత రెండు, అంతకుమించి గాని చరణాలుంటాయి. కృతివలె దీనికి అనుపల్లవి లేదు. కాగా చరణాలన్నీ ఒకే పక్కీలో నడుస్తాయి. అంటే స్వరాలు మారవు. పాడినపుడు ఒక్కొక్క చరణంకాగానే - పల్లవిని ఎత్తుకుంటూ ఉండాలి.

కీర్తన అనే పదానికి దక్షిణ భారతంలో అర్థనిర్వచనం వేరు. ఉత్తరాదిన "కీర్తన్‌కార్" అంటే హరి కథకుడు అని అర్థం. మన వైపున కీర్తన అనగా పల్లవి, అనుపల్లవి, చరణం అను మూడు విభాగాల సమ్మేళనం. ఒక్కొక్క విభాగానికి కొన్నికొన్ని మట్లతో వరసలు కూర్చి ఉంటాయి. చరణానికి చరణానికి సంగతులు మారతాయి. ఈ విధంగా ఒక రాగాన్ని ఈ కీర్తన విభాగాలలో అనేకవిధాలుగా అమర్చుతారు. సంగతులు, గమకాలు, మేళకర్తే ఇదమిత్థంగా నిర్ణయిస్తాడు. మమూలుగా ఈ ప్రకారం ఈ మేరకు వీటిని పాడుకోవచ్చు. అయితే గాయకుడి శక్తి సామర్థ్యాలనుబట్టి అయినా రాగాలపై అతడికి గల అధికారాన్ని బట్టి, ఈ పాటను పాడినపుడు రాగాలాపనను ఇతోధికంగా శాసించవచ్చు. నిర్ణీత స్వరాలనే కాక ఆ క్షణానికి స్ఫురించిన వాటిని కూడా కలపుకోవచ్చు. అయితే ఇవన్నీ ఆయా రాగాల ఆరోహణ, అవరోహణలకు అనుగుణంగా ఉండాలి. భావానికి, పొసగని మెళకువలుతగవు. రసభంగం జరుగరాదు. ఈ దృష్ట్యా దాక్షిణాత్య కీర్తన సంగీత పాండితీ ప్రకర్షకు, ఔత్తరాహ కీర్తన

(మిగత 554 పేజిని చూడుడు)

# స వ తి

మూలం:
శ్రీ ప్రేమచంద్

అనుసరణ:
శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి



దేవదత్తుని వివాహం అయి చాలకాలం అయింది. కాని అతనికి సంతానం కలుగలేదు. తల్లిదండ్రులు బ్రతికినంతకాలం రెండో పెండ్లి చేసికోమని బలవంతం చేసేవారు. కాని తన భార్యమీద ఉండే అనురాగం అతని నాపనిచేయనీయలేదు. రాబోయే భార్యవల్లకలుగబోయే సంతాన సౌఖ్యం కోసం ప్రస్తుతసాంసారిక సుఖాన్ని నాశనంచేయడం అతనికి సుతరామూ యిష్టంకానిపని. అంతేకాక దేవదత్తుని భావాలే వేరు. సంతానం కలుగుతే తల్లిదండ్రులకి బాధ్యతలెక్కువ అవుతాయి. అదీగాక తన సంతానాన్ని పోషించి విద్యాబుద్ధులు గరపించలేకపోయిన తరువాత ఆ సంతానంవల్ల తనకేకాక దేశానికీకూడా శాంతి ఉండదు. ఇలాంటి ఆలోచనలు రాగానే దేవదత్తుడు రెండవ పెండ్లివిషయం ఎవరినీ ఎత్తనిచ్చేవాడు కాదు. వయస్సు ముదిరినకొలదీ ఆయనలో ఐహికచింతపోయి ఆముష్మికచింతకలుగసాగింది. నెమ్మది నెమ్మదిగా శారీరక వ్యాధిగ్రస్తుడుకాసాగాడు. అట్టి సమయంలో సంతానం విషయం ఎత్తేసరికి అతడు గడగడలాడసాగాడు.

దేవదత్తుని భార్య గోదావరి అంత త్వరగా నిరాశ చెందే వ్యక్తిగాదు. గోదావరి మొదట్లో యంత్రతంత్రాలమీద దేవీదేవతల మీద విశ్వాసం ఉంచేది. కాని వాటివలన ఆమెకేమి ప్రయోజనము కలుగలేదు. ఆమె మాసాలు సంవత్సరాలు ఇదే విషయాన్ని ఆలోచిస్తూయుండేది. మనస్సును అనేకవిధాల సమాధానపటుచుకునేది. ఆ హృదయాంతర్గతంలోని, ఆబాధలోపలనే ఉండి బాధించసాగింది. దానికి ఆత్మత్యాగమే శరణ్యం అనుకుంది. పతిప్రేమకోసం తనజీవిత సర్వస్వాన్ని త్యాగంచేయడంలోకల ఆనందం మరెందులోను లేదనుకుంది.

గోదావరి తన మానసిక ప్రభలభావాలముందు తలవంచుకుంది. ఇప్పుడిక సవతి శుభాగమననిరీక్షణలో మునిగిపోయింది.

గోదావరి సంభాషణ విని దేవదత్తుడు స్థభించిపోయాడు. మొదట్లో తన ప్రేమపరీక్షకోసం యిలా చేస్తోందేమో అనుకున్నాడు. కాని గోదావరి గంభీరంగా యిలా అంది - "మీరు నామాటలు వేళాకోళంగా జమకట్టకండి నేను హృదయపూర్వకంగా చెప్తున్నాను. సంతానంకోసం సవతికి సర్వవిధాలా సేవచేయనిశ్చయించుకున్నాను." ఇటువంటి ఉన్నత పవిత్రభావాలతో నిండిన తనభార్యను ఒక్కసారి తన కౌగిలిలోకి తీసుకొని దేవదత్తుడు ఆమెతలనిమిరాడు. కపోలాలు స్పృశిస్తూ యిలా అన్నాడు - "అది నావల్లకాదు. నాకుసంతానేచ్ఛలేదు."

గోదావరి కాస్త గట్టిగాయిలా అంది. "మీకు లేకపోవచ్చు. కాని నాకువుంది. మీకోసంకాకపోతే నాకోసమేనా యీ పనిచేయండి."

దేవదత్తుడు సరళస్వభావంకలవాడు. తనకిష్టంలేకపోయినా నెమ్మదినెమ్మదిగా తనభార్యమీదగల అనురాగంకొద్దీఆమెమాటలు అంగీకరించసాగాడు. వివాహవిషయంలో దేవదత్తుడు ఏమియుశ్రమపడ

లేదు. గోదావరి కార్యదీక్ష అతనికి వైవాహిక జీవితారంభంనుంచి ఎటువంటి శ్రమనుకల్గించడము లేదు. గోదావరి యీపనికై తనసర్వభూషణాల్ని ఆనందంగా ఒలిచియిచ్చేసింది గూడ. తానీ వయసులో వివాహమాడితే జనులు హేళనచేస్తారని దేవదత్తుడు భయపడుతూనేవున్నాడు. అంతేకాదు తనఆఫీసులోని మిత్రులుచేసే పరిహాసాలకు తనేమని సమాధానం చెప్పగలడు. ఈ ఆలోచనలు అతనిమనస్సు బాధించసాగాయి కాని, గోదావరి వీటినెంతమాత్రము లెక్కచేయలేదు. నిర్విఘ్నంగా తనపని పూర్తి చేసింది. కొత్తకోడలుయింటికివస్తే అత్తగారు ఆనందించినట్లుగా, తనకొడుకునకు పెళ్లిచేసి, పెద్దవానిని చేసినట్లుగా ఆనందించింది. గోదావరి ఆనందంగా గెంతుతూ పాటలుపాడింది.

చాలా మాసాలు ప్రశాంతంగా గడిచిపోయాయి. గోదావరి తన సవితిమీద అత్తగారిలా పెత్తనంకొనసాగించింది. కాని తను ఆమెకు "అత్తనుకాను" అనేవిషయాన్ని మాత్రం ఆమెమరచిపోలేదు. ఇక గోమతికికూడ తనస్థితిమీద అహంభావంవుంది. ఆ అహంభావంస్త్రీకి సహజంగా ఉండేదేకూడ. ఆ కారణంవల్ల అత్తగారిలాశాసించే గోదావరి ప్రవర్తన కఠోరంగాలేకపోయినా ఆమెచే శాసించబడ్డం గోమతికి సుతరామూ యిష్టంలేదు. ఆమెకు తన స్వల్పావసరాలకోసం గోదావరిని సలహాచెప్పడం ఎంతమాత్రం యిష్టంలేదు.

కొన్నాళ్లలో గోదావరి ప్రవర్తన మార్పు కలుగుతూవచ్చింది. దేవదత్తుడు ఆఫీసునుండి ఇంటికి వచ్చే సమయంలో, అతనికేసి చాలా తీవ్రంగా చూడసాగింది. ఇప్పుడామె స్వాభావిక గాంభీర్యంలో లోపం కనుపించసాగింది. చిన్నవిషయాలుకూడ ఆమె మనసులో దాచుకోలేకపోతోంది. భర్త ఆఫీసునుంచివచ్చి విశ్రాంతిగా కూర్చునే సమయంలో గోదావరి గంటలుకొద్దీ ఆయనదగ్గరే కూర్చుని గోమతిప్రవర్తనలనుగూర్చి ప్రసంగించేది. ఈ సంఘటనలలో చిన్నచిన్న విషయాలు కారణం అవడంవల్ల దేవదత్తుడు అట్టే పట్టించుకునేవాడు కూడకాదు. గోదావరి మృదువుగా మాట్లాడడం గోమతికి కాస్తభయపడుతూన్నట్లు ప్రవర్తించడంలోని ఆంతర్యం దేవదత్తుడు తెలుసుకోలేకపోయాడు. అవసరంకూడా ఏమీ కనుపించలేదు. గోమతిసౌందర్యంముందు యౌవ్వనంముందు, ఆమె లజ్జాయుతనేత్రాలముందు తనను పరాభూతురాలుగా భావించుకోసాగింది. ఆనకట్టను తెంచిపారేసి, నదీవేగాన్ని మట్టిగట్టుతో ఆపాలని ప్రయత్నించసాగింది.

ఆదిరక్షాబంధనంరోజు. ఆరోజున గోదావరి, గోమతిని క్షీరాన్నం వండమనిచెప్పినది. "పంచదార లేదు" అంది గోమతి

ఇది వింటూనే గోదావరి విస్మిత అయింది.

"నిన్నగాక మొన్న తెచ్చిన పంచదార అప్పుడే అయిపోయిందా? కష్టపడి సంపాదించే వాళ్లకి బాధకాని, తినే వాళ్లకేమి బాధ?"

దేవదత్తుడు యింటికివచ్చేసరికి యీ చీమంత విషయాన్ని కొండంతగా వర్ణించి ఆయనచెవుల్లో పడేసింది. గోదావరి దేవదత్తుడు ఒక్కక్షణంసేపు గోమతిని గూర్చి ఆలోచిస్తునే లోలోపలనవ్వుకోసాగాడు.

దేవదత్తునికి ఏదో శారీరకవ్యాధి బయలుదేరింది. డాక్టర్లు కారంతగలనీయవద్దని జాగ్రత్తగా పథ్యం చేయకపోతే ప్రమాదమని సలహాయిచ్చారు. గోదావరి వంటచేస్తే వంటిట్లోకి అసలు మిరపకాయవాసన కూడ తగలకుండా జాగ్రత్తగా వంటచేసేది. గోమతి ఓరోజున పప్పుకూరలో మసాలాతోబాటు కొద్దిగా కారంకూడ వేసింది. ఆవేళ దేవదత్తుడు కూరముట్టుకోలేదు. కాని గోదావరి గోమతిమీద యీ పొరబాటుకి కారాలు, మిరియాలు నూరిపోసింది.

దేవదత్తుడు సత్యభాషంకలవాడు. ఆఫీసునకు వెళ్లడం అక్కడి పనులు చక్కబెట్టుకోడం. ఇంటికి వచ్చి అన్నపానాదులయినాక విశ్రాంతిగా ఏదైన

పత్రిక తిరగేయడం ఇవీ ఆయనపనులు. ప్రశాంత జీవితం అంటే ఆయనకు చాలాయిష్టం. ఆఫీసులో అందరితో పాటు అతనికికూడ సినిమా ఫ్రీపాస్సు యిస్తారు. కానిదానిని అతడు వినియోగించుకోడు. గోదావరికి దేవదత్తుని స్వభావంతో పరిచయం ఎక్కువ. గోదావరి అభిప్రాయప్రకారం దేవదత్తుడు నడుచుకోడం పరిపాటు అయిపోయింది. నిజానికి ఆయనకు అందులోనే సౌఖ్యం కనిపించిందికూడా.

కాని పరిస్థితులు మారిపోతుంటాయి. అది మానవ ప్రకృతి. పరిస్థితులకు లొంగిపోయే ప్రత్తిలాంటి మృదువైనవస్తువులుకూడా కఠోరరూపాన్ని దాలుస్తుంటాయి. ఈ మధ్య యింట్లో 24 గంటలూ జరిగేగందరగోళం దేవదత్తుని చాలా బాధిస్తోంది. అప్పుడప్పుడు వచ్చినకోపాన్ని లోలోపల అణిచి పెట్టుకునేవాడు. ఎంతకాలం ఆ బడబాగ్నిని దాచుకోగలడు? హృదయంలోంచి బయటకురాకుండా ఆక్రోధాగ్ని జ్వాలలు హృదయాన్నే దహించసాగాయి.

సవతిని తీసుకురావడంలో గోదావరి తనసర్వస్వాన్ని త్యాగం చేసిందని దేవదత్తుడు అంగీకరిస్తాడు. వాస్తవానికి ఆమె యీత్యాగం అలౌకికమయింది కూడా. ఆమె అలాచేయడానికి మూల పురుషుడు తానేనని అతనికి తెలుసు. తత్కారణంగా గోమతి మీద ఎటువంటి కోపాలు చూపవలసిన అవసరం గోదావరికిలేదు. పాపం! నిజానికి గోమతికిక్కడ ఎటువంటి సుఖములేదు. భర్తయిన తాను చూస్తే వృద్ధుడు-రోగి. ఇక సాంసారిక విషయమూ- ఉద్యోగం ఊడిందంటే మరుక్షణంలో పొయ్యిలో గండు పిల్లులు మేనువాల్చి కునుకు తీస్తాయి. ఇటువంటి పరిస్థితులలో గోమతి విషయమై గోదావరి ప్రవర్తన అతనికి చాలా అనుచితంగానూ బాధగానుకూడ తోచింది.

దేవదత్తుని మానసిక బాధను గోదావరిగుర్తించ లేకపోయింది. అశక్తికూడ ఆమెలోలేదనేచెప్పాలి. కాని విషయాలను భర్తముఖంలోనే గుర్తించగలిగేది. తత్ఫలితంగా గోమతిమీద యీర్ష్యాబయలుదేర సాగింది. అంతేకాకుండా భర్తను అవకాశం దొరికినపుడల్లా నిష్ఠురంగా ఎత్తిపొడిచేది. రోజు రోజుకీ ఆమె లోని మనోమాలిన్యం అధికం కాసాగింది.

గోదావరి క్రమక్రమంగా భర్తతో గోమతి సంబంధమైన ప్రస్తావన చేయడం మానేసింది. గోమతి అనేవ్యక్తి ఆయింట్లోనే లేదన్నట్లు వర్తించ సాగింది. ఆమె అన్నపానాలవిషయంలో కాని ఆభూషణాల విషయంలోకాని అసలుపట్టించుకునేది గాదు. ఓపర్యాయం చాలాకాలమువరకూ ఆమెకు టిఫెన్ లభించనేలేదు. దేవదత్తుడు ఎంత సేపూ ప్రశాంతంగా ఉండాలనీ గృహాల్లోకలహాలు రాకూడదనీ ఆశించేవాడు. అందుచేత యీ అత్యాచారాలు చూస్తూకూడ అతడేమీ చేయలేకపోయేవాడుకాదు. కాని యీ సంఘటన ఆయన మానససాగరాన్ని మంధరగిరిలామధించసాగింది. ఒక రోజున గోదావరితో భయపడుతునేయిలా అన్నాడు. "ఈ మధ్య టిఫెన్ సక్రమంగా రావటంలేదే?"

గోదావరి కోపంగా పల్కింది.

"మీరు లేకపోతే టిఫెన్లు ఎక్కడనుండివస్తాయి? నాకెవరైన నౌఖర్లా - చాకర్లా."

దేవదత్తుని మనసులో యీ గోదావరి పల్కులు ముల్కులా తగులుకున్నాయి. దానికి కారణం ఎప్పుడూ గోదావరి అతనితో అంత తీవ్రంగా మాటాడలేదు.

"కాస్త శాంతంగా మాట్లాడు. ఇదేమంత కోపగించుకోవలసిన విషయం కాదులే."

గోదావరి నేలకేసిచూస్తు పల్కింది-

"నాకొచ్చినట్లు మాట్లాడుతాను. ఇతరుల్లా మృదువుగా నేనెక్కడ మాట్లాడగలను?"

దేవదత్తుడు కొంచెము తీవ్రంగా సమాధానమిచ్చాడు- "ఈ మధ్య నీ ప్రవర్తన నాకేమీ అర్థం

కావడంలేదు. అనవసరంగా ప్రతి విషయాన్నీ తీవ్రంగా సమాధానమిస్తున్నావు.”

గోదావరివదనం యీ మాటలతో ఎఱ్ఱబడిపోయింది. ఆమె పెదవులు ఒణకసాగాయి. ఆమె యిలా అంది - “ఇప్పుడు నా మాటలు మీ కెందుకు నచ్చుతాయిలెండి! నేనే మీకు దోషురాలినిగా కనిపిస్తున్నాను. ఇప్పుడు మీ మనసులో నాకు స్థానం లేదు. నాకు గౌరవంలేనప్పుడు బాధ్యత మాత్రం ఎందుకు. ఇదిగో పెట్టెతాళం తీసుకోండి. మీ జమా ఖర్చులు మీరే చూసుకోండి. ఎంతవరకూ నిర్వహించాలో నిర్వహించాను. ఇక నేను నిర్వహించలేను.”

ఈ మాటలకు దేవదత్తుడు స్మృతితప్పినవానిలా బాధపడసాగాడు. ఏశాంతిభంగం అంటే ఆయనకు చెప్పరానిభయమో ఆ శాంతిభంగం యిప్పుడా యింట్లో ప్రవేశించింది. అతడేమి మాట్లాడలేకపోయాడు. ఇక మాట్లాడడంవల్ల ప్రయోజనంకూడ లేదనుకున్నాడు. బయటకు వచ్చేసి ఆలోచించసాగాడు. నేను గోదావరికి ఏం అయిష్టంగా ప్రవర్తించాను? గోదావరి కలుగజేసికోపోతే ఇంటి పనులు సక్రమంగా జరుగవనే విషయం అతనికి తెలియకపోలేదు. ఇక తాను చేయగల్గిందేముంది? భారమంతా తనమీదనే పడుతుంది? ఒక వేళ ఆమె ఒప్పుకున్నా చాలా కష్టంమీద వప్పుకుంటుంది-కాని దేవదత్తుని శుభదినములు మంటగలిసిపోయాయి. పెట్టె తాళం నాల్గునాళ్లవరకూ కాలనాగులా వాకిట్లోనే పడివుంది. ఎవరూ దాని దగ్గఱకు వెళ్లటానికి సాహసించలేకపోయారు.

చివరికి నాలుగోనాడు దేవదత్తుడు సాహసించి ఆ తాళం తీసాడు. ఆ తాళం తీస్తున్న అతనికి నెత్తిమీద ఎవరో పెద్ద భారం ఎత్తుతూన్నట్లునిపించింది. బాధ్యతలేనివారికి తమ స్థానంనుంచి కదలడం చాలా బాధాకరమైన విషయం.

ఆఫీసు పనులు కారణంగా తాను యింటి పనులు నిర్వహించుకోలేనని తెలిసికూడ దేవదత్తుడు ఆ తాళం చెవి తీసాడు. తాళాలంటే ఆయన దగ్గరే వుంటున్నాయి. కాని కార్యకలాపాలన్నీ గోదావరి స్వయంగానే చేసుకుపోతోంది. ఆ క్షణంనుంచి గోదావరికి అధికారం సమాప్తమయింది. గృహిణికి వుండవలసిన గౌరవమర్యాదలు నాటితోనే - ఆ తాళంచెవితోనేపోయాయి. చూస్తుండగానే ఆమెలో చాల పరివర్తన వచ్చేసింది. పదచ్యుతురాలైన మహారాణిగతి పట్టింది. గోదావరికి ఇతరుల దైన్యదశకు సానుభూతి ప్రకటించడంతప్ప ఆమెకు వేరే అధికారంలేదుకూడా.

గృహకార్యాల్లోని మార్పుతోబాటు గోదావరి మనస్సులో విచారం బయలుదేరింది. ఈర్ష్య మనస్సులోదాగే వస్తువు. అది బయలుదేరకుండా ఉండాలిగాని బయలుదేరితే బయటపడకమానదు. ఒకవేళ బయటపడనీయకుండా లోలోపలనే దాచ యత్నిస్తే అది పెరిగిపోయి బయటపడుతుంది. కాని దాగదు. ఇరుగుపొరుగు స్త్రీలు సదా యీ చర్చయే చేసేవారు. “ప్రపంచం ఎంత స్వార్థభూయిష్టమయినది? పాపం అమాయకురాలు స్వసుఖాన్ని వదలుకొని పెళ్ళిచేసింది. తెల్సుండే కూర్చున్న కొమ్మను నరుక్కుంది. పాపం! ఆఖరికి తన ఆ భూషణాల్నికైతం ఒల్చి యిచ్చేసింది. తత్ఫలితంగా కొంగును సదా కన్నీటితో తడపవలసి వచ్చినది. సవతి అంటే సవతే! భర్తకూడ యిప్పుడామెను సరిగా చూడడం మానేశాడు. పాపం ఇప్పుడు దాసీదానిలా ఆ యింట్లోపడివుంది. ఎందుకు ఇలాంటిబ్రతుకు? బ్రతికితే ఏం! లేకపోతే ఏం!” ఇలా ఆ వీధిలోని స్త్రీలు నోటికొచ్చినట్లు మాట్లాడసాగారు.

ఈ సానుభూతి పల్కులు వినేసరికి ఆమెలో నిద్రాణమైఉన్న ఈర్ష్యాగ్ని నానాటికి ప్రజ్వరిల్లసాగింది. కొందరి ఎదుటివారి దుఃఖాలనుచూసి ఆనందించడం తమ ఆనందాన్ని అణచి సానుభూతిని ప్రకటించడం పరిపాటయిపోయింది.

గోదావరికి పూర్వంలోగల పూర్ణవిశ్వాసం నాశన

మయింది. దేవదత్తునికి అనిర్వచనీయమైన ఆవేదన బయలుదేరింది. గృహకృత్యాలు నిరాటంకంగా సాగిపోతున్నాయి. కాని దేవదత్తుని ఏర్పాట్లు అనుభవ శూన్యంగా గోచరిస్తూనే ఉన్నాయి. గోదావరి సక్రమ ఏర్పాట్లకీ వీటికి చాల భేదంఉందే! అనుకుంటూండేవాడు అతను. కాని కార్యకలాపాలు జరిగిపోతూనే వున్నాయి. గోదావరికి మాత్రం గోమతిచేసే ప్రతిపని దోష పూర్ణంగానే కనిపిస్తోంది. ఈర్ష్యలో అగ్నివుంది. కాని అగ్నికుండవలసిన గుణం మాత్రం దానిలో లేదు. హృదయాన్ని విస్తరింప జేయడానికి బదులుగా దాన్ని సంకుచితం చేస్తూంటుంది. ఇంట్లో ఏదైన హాని సంభవిస్తుంటే గోదావరికి దుఃఖానికి బదులుగా ఆనందం కలుగుతోంది. చాలా రోజులువరకు సూర్యభగవానుని దర్శనంకాలేదు. తత్కారణంగా పెట్టెలోని బట్టలు చెదపట్టసాగింది. నూనె సామగ్రి అంతా సర్వ నాశనమైపోయింది. గోదావరికి యివి యిసుమంతయు బాధకలిగించలేదు.

దేవదత్తుని మానసిక ప్రవృత్తిలో నానాటికి మార్పు రాసాగింది. గోదావరి గృహ కృత్యాలు సక్రమంగా చేస్తున్నంతకాలం దేవదత్తునికి ఏవిధమైన చీకు చింతా ఉండేదికాదు. చివరకి కాయగూరలకి కూడ బజారుకు వెళ్లవలసివచ్చేదికాదు. కాని యిప్పుడు గోదావరి తన భర్త రోజుకి నాలుగయిదు సార్లుకూడ బజారుకు వెళ్ళడం చూస్తోంది. గృహంలో ఏర్పాట్లు సక్రమంగా లేకపోవడమే దానికి ముఖ్య కారణం.

గోదావరి తన అవసరంకోసం దేవదత్తుని ఎప్పుడూ బజారుకి పంపేదికాదు. తనకేదైన అవసరమువస్తే ప్రక్కింటి తాతచేత తెప్పించుకుంటూంది. ఆ కారణంచేత దేవదత్తుడు గోదావరికి చీర్లఅవసరంలేదేమో అని పొరబడేవాడుకూడ. అతని తలమీదనుంచి ఎంత భారమైతే గృహంలో దింపుతారో అంతగానూ అతను ఆనందించేవాడు. దేవదత్తునికి క్రొత్త ప్యాషన్సుఅన్నా, క్రొత్త సరుకులన్నా గిట్టదు. కాని యిప్పుడు బట్టలకోసం అతనికి బజారుకి వెళ్ళక తప్పటంలేదు. ఒకసారి గోమతి దగ్గఱ చీరలు ఏమీ లేకపోయాయి. దేవదత్తుడు బజారునకు వెళ్ళి మంచివి ఒక జత చీరలు తెచ్చాడు. అప్పచేసి వస్తువులు కొనడంలో అతడు ఎంత మాత్రము సందేహించడు. గోమతి ఆ చీరల్ని గోదావరికి చూపెట్టింది. గోదావరి వాటినిచూసి యిలా అంది – "బలే మంచిదానవు, ఎప్పుడు ఆయనకు బట్టలుకొనడం అలవాటులేదు. ఇప్పుడు నీవు నేర్పావు. నేను ఆయనతో పదహారేళ్లు కాపరంచేసాను. కాని యింతవరకూ స్వప్నంలో కూడ ఆయనచేత్తో కొనితెచ్చినబట్ట కట్టుకోలేదు."

ఇలాంటి సంఘటనలు నానాటికి గోదావరియొక్క ఈర్ష్యాగ్నిని ప్రజ్వరిల్ల జేస్తున్నాయి.

తన భర్తలో యిదివరకెన్నడూ లేని అనేక మార్పులు గోమతి తన యౌవ్వనంలో జయించి వేసింది. తను అనేక ప్రయత్నాలుచేసికూడ వారి చేత చేయించలేని అనేక కార్యకలాపాలు గోమతి ఎంతో సులభంగా చేయించివేస్తోంది. ఇప్పుడామెకు అర్థంకాసాగింది. తను ఎటువంటి ప్రేమను చూపిందో ఎటువంటి త్యాగంచేసిందో దానిఫలితంగా యికతాను జీవితాంతం వరకు విచారించవలసిందే. దైవయోగం వల్ల ఈ పరిస్థితులలోనే గోమతి మంచమెక్కింది. ఆమెకు లేచికూర్చునే శక్తికూడలేదు. గోదావరి వంట ప్రారంభించింది. గోమతి విషయాలు ఆమె వాస్తవాలని, నిశ్చయించలేకపోతోంది. నా చేత వంట చేయించుకోవాలనే భార్య భర్త లిద్దరూ కపటనాటకం ఆడుతూన్నారనుకుంది. తన బాధలు వర్ణించి యిరుగు పొరుగు అమ్మలక్కలతో చెప్పుకొని కొంగు తడపడటంలో ఆమెకేదో ఆనందం కనిపించింది.

దేవదత్తునికీమధ్య తిండి సరిగా సహించడంలేదు. అతడు ఎందుచేతనో యీ మధ్య గోదావరితో ఏకాంతంగా మాట్లాడ్డానికి భయపడుతున్నాడు. ఏకాంతంగావుంటే ఆమె ఎటువంటి హృదయ విదారక

నైన పల్కులు పలుకుతుందో అని భయపడేవాడు. అటువంటి భయంకర అశాంతిమయ సమయం వస్తుందేనోనని భోజనంచేస్తూనే భయపడేవాడు. గోదావరి తన తీక్ష్ణ నేత్రాలతో అతని మనోగతి అభిప్రాయం తెలుసుకొని తాత్కాలికంగా మాటాడకుండా ఉండిపోయేది.

ఒకనాడామె యింక ఉండలేక యిలా అంది - "నాతో మాట్లాడంకూడ తప్పేనా! నాతో మాట్లాడనని ఎక్కడేనా శపథంకాని చేసారా ఏం? ఇంటి పద్ధతులు చూస్తున్నారుగా! అన్నీ మీకు యిచ్చాను. పాపం! చక్కగా జరిగిపోతున్నాయి గదా?"

దేవదత్తుడు తలఎత్తకుండానే సమాధానమివ్వసాగాడు. - "ఎలా జరగాలో అలా జరుగుతాయి" అంటూ పీటమీదనుంచి లేవబోయాడు. గోదావరి "లేస్తే నే చచ్చినట్లే" అని ఒట్టుపెట్టుకుని భర్తను కూర్చోబెట్టాలనుకుంది. కాని అతడు ఒక్క క్షణంకూడ అక్కడ ఉండలేకపోయాడు. ఆమె వంట మానేసింది. నాడు యిల్లంతా ఉపవాసమే.

గోమతిలో ఒక గొప్ప విచిత్రమేమంటే ఆమె అత్యంత కఠినమైన మాటలైన సహిస్తుంది. కాని ఆకలిని సహించడం ఆమెకు చేతకానిపని. అందుచేతనే ఆమె ఏమీ నోములూ, వ్రతాలుకూడ చేయదు. కాని పెద్దవాళ్ళ బలవంతంమీద జన్మాష్టమి మాత్రం చేస్తుంది. కాని అస్వస్థత కారణంగా నేడు ఆకలి మరీ హెచ్చిపోతోంది. రెండు ఝాములైనా తిండి సంబంధమైన ఏర్పాట్లేమీ లేకపోవడంచూసి బజారునుంచి మిఠాయి తెప్పించుకుంది. గోదావరిని యింకా ఏడిపించాలనే ఆమె అలా చేసిఉంటుంది. లేకపోతే ఒకపూట భోజనంలేనంతమాత్రాన చచ్చిపోదు కదా.! గోదావరి ఆ పాద మస్తకం యీర్ష్యాగ్నితో మండసాగింది. ఆమెకూడా తక్షణం మిఠాయి తెప్పించుకుంది. చాలా కాలానికి నేడామె కడుపు నిండా మిఠాయితింది. ఇవన్నీ యీర్ష్యకు ఫలితాలు.

ఏ గోదావరి రెండు ఝాములు అయితేకాని అన్నం ముట్టేదికాదో ఆ గోదావరి నేడు తెల్లవారేసరికల్లా టిఫెన్ లేకపోతే ఉండలేకపోతుంది. ఇదివరకెప్పుడూ తమలపాకులు ముట్టేదికాదు. ఇప్పుడవి లేకపోతే ఒక్క క్షణం గడవడంలేదు. ఆ లక్షణాలన్నీ గొప్పింటి క్రొత్తకోడలులా ఉన్నాయి.

నాడు జన్మాష్టమి శుభదినం. దేవదత్తుని స్వభావిక ప్రవృత్తి యీ నాడు పూర్తిగా మారిపోతూంటుంది. ఆయన చాలా ఉత్సాహంగా కార్యకలాపాల్లో నిమగ్నమైపోతూంటాడు. ఈ వ్రతాన్ని గోదావరి నీరుకూడా ముట్టకుండా నిష్ఠగా చేస్తుంది. అదీగాక దేవదత్తుడు కృష్ణోపాసకుడు కూడా. నేడు ఆయన ఆజ్ఞ ననుసరించి గోమతికూడ జలపానంచేయకుండా వ్రతంచేయ సమకట్టింది. కాని ఇంతలో దాసీదివచ్చి యిలా అంది. "అమ్మగారూ - గోదావరమ్మగారు యీ వేళ వ్రతం చేయరుట. ఏమైన ఫలహారం తెప్పించండి."

సాయంకాలం గోదావరి కృష్ణమందిరానికి వెళ్ళాలని ఒంటెద్దుబండికి కబురు పంపింది. ఈ కబురు గోమతికి నచ్చలేదు. దానికి ముఖ్యకారణం. బండ్లకిరాయి ప్రస్తుత పరిస్థితులలో చాలా ఎక్కువగానే ఉంది. కృష్ణమందిరం కొంచెం దూరంకూడాలేదు. అందుచేత గోమతి కొంచెము చిరాకుగా యిలా అంది - "సంపాదించేవాళ్లకి కష్టంకాని, ఖర్చుపెట్టేవాళ్లకేం! లేకపోతే మరేవిటీ? నాల్గడుగుల దూరముందోలేదో యీ పాటిదానికికూడ బండికావలా? ఎంత విడ్డూరం?"

మూడు సంవత్సరాలక్రితం యిదే మాటను గోదావరి నోటినుంచి గోమతివింది. నేడు గోదావరికి అవే మాటలు సవతిచేత వినవలసివచ్చింది. అంతా పరిస్థితి ప్రభావం!

ఈ మధ్య గోదావరి చాలా ఉదాసీనంగా వంట చేస్తోంది. ఇప్పుడు భర్తయొక్క పథ్యా పథ్య విషయాలతో ఆమెకు సంబంధంలేదు. ఒక రోజున పప్పు మసాలలో అధికంగా కారంవేసింది. లోగ

భయంచేతనే దేవదత్తుడు అసలు దానిని ముట్టలేదు. ఈ విషయం గోమతికి తెలిసింది. ఆమె గోదావర్కి వినపడేటట్లు దాసీ దానితో యిలా అంది - "మీ పెద్దమ్మగారు ఆమె సుఖమే చూసుకుంటుందిగాని ఆ ముసలాయన బాధ చూడదుకదా?"

ఇలాంటి మాటలు గోదావరికి యిది వరలో చాల వినిపించింది. కాని యిప్పుడు స్వయంగా వింటోంది. అంతే తేడా.

నేడు గోదావరి గంగను కౌగలించుకోవాలని వచ్చింది. మూడు సంవత్సరాలైంది. నూతన వధూవరులను ఆమె గంగపూజకు తీసుకువచ్చి ఇప్పుడు తన ప్రాణ పుష్పాన్నీ పూజచేయవచ్చింది. నేడు ఆమె గంగయొక్క ఆనందమయ ఉత్తుంగతరంగాలలో శాశ్వతంగా విశ్రాంతి తీసుకోవాలని వచ్చింది.

గోదావరికి యింక ఆ యింట్లో ఒక్క క్షణం ఉండడంకూడా కష్టమైపోయింది. ఏ యింట్లో తాను రాణిగా జీవించిందో ఆ యింట్లో ఒక దాసీగా ఆమె జీవించలేకపోతోంది నిజానికది అసంభవంకూడా. అటువంటి దుఃఖపూర్ణ జీవితం గడపడంకంటె గంగ ఒడిలో శాశ్వతంగా నిద్రించడం మంచిదనుకుంది.

చాలాసార్లు "నేను చచ్చిపోతే మీరు సుఖంగా ఉండవచ్చు" అని భర్త దగ్గఱ అంది. ఆఖరికి ఆయన సహించలేక ఓ నాడు యిలా అన్నారు - "పోనీ నీవు చచ్చిపోయినా బాగుండును." ఆ మాటలు వినీ వినగానే గోదావరి చచ్చిపోవాలనుకుంది. ఆ మాటలని ఆయన చాలా రోజులు గడిచాయి; నేడు గోమతి కూడా అదేమాట అంది. ఇక గోదావరి సహించలేకపోయింది. ఏ వ్యక్తి ఆనందంకోసం తన సర్వస్వం త్యాగంచేసిందో ఆ వ్యక్తికే తామీద ప్రేమ లేనపుడు- ఆయన అనుచరులకి ఉండకపోవడంలో ఆశ్చర్యమేముంది? అనుకుంది.

ప్రపంచమంతా ప్రకృతిమాత ఒడిలో నిద్రపోతోంది. గోదావరి బయటచేరింది. ఆకసంలో కారుమేఘాలు వ్యాపించి ఉన్నాయి. వర్షపు చినుకులు పడుతునే వున్నాయి. అక్కడ ఆమె కనుల నుంచి కన్నీటిధార ప్రవహిస్తోంది. ప్రేమబంధనం ఎంత కోమలమైందో అంతను కొన్నివేలరెట్లు దృఢమైందికూడా. గోదావరి గడపమీద నిలబడి గంటలకొద్దీ ఏడవసాగింది. పూర్వస్మృతులు జ్ఞాపకం వచ్చినకొలదీ కన్నీరుధారలై పారుతోంది. ఒకానొకప్పుడు ఆమెకు గృహంలో ఎంత ప్రేమ ఆదరసుఖం వున్నాయి. అవన్నీ ఆలోచిస్తూ ఆమెకు ఒక్కసారిగా భర్తయొక్క సవతియొక్క కఠోరవచనాలు జ్ఞాపకానికివచ్చి కర్ణభేరీలు మ్రోగుతున్నాయి. కళ్లలో మరల కన్నీటిధార ప్రవహించసాగింది. గోదావరి గడపదాటింది.

భాద్రపదమాసం రాత్రి సమయాల్లో ఆ నదీమతల్లి మహోత్తుంగతరంగా గంభీరఘోష భయానకంగా ఉంటుంది. అంతలోనే మెరపులో ఆ ఉత్తుంగతరంగాలు తళతళ మెరవసాగాయి. ఆ ఉజ్వలతరంగాలు ఉన్మత్తగజంలా మీదకి వస్తున్నాయా అన్నట్లనిపిస్తున్నాయి. జీవన సంగ్రామానికి సంబంధించిన ఒక విశాల దృశ్యం కనుల ఎదుట నృత్యం చేయసాగింది.

అదే సమయంలో గోదావరి హృదయంలోకూడ అనేక భావతరంగాలు లేవసాగి తాళోజప్రమాణంగా లేస్తూ మరల హృదయ సాగరంలో లీనమైపోతున్నాయి. ఎక్కడ? అంధకారంలో.

ఇంతగా ఘోషించే గంగ, గోదావరికి శాంతినీయకలదా! ఆ తరంగాలలో సుధాసమధురధ్వని లేదు. ఆ సమయంలో ఉద్దండభీషణ నిర్ణయ రూపం దాల్చింది.

గోదావరి - నదీతీరంలో కూర్చొని ఏమిటాలోచిస్తోందో? ఎవరు చెప్పగలరు?

దేవదత్తుడు యిప్పుడు తనకోసం వస్తున్నాడని ఆమెకు అనిపించడంలేదా? ప్రేమబంధనం ఎంత దృఢతరమైనది?

ఆ అంధకారంలో ఈర్ష్యనిష్ఠురత నైరాశ్య భావాలతో పీడించబడి ఆ అబల గంగఒడిలోకి దూకేసింది. తరంగాలు తమ చేతులుచాచి ఆమెను కావలించుకుని అదృశ్యమైపోయాయి.

బాల భాస్కరుడువచ్చి కూర్చున్నాడు. గోదావరి లేదు. ఆమె మంచంమీద యీ ఉత్తరంపడి వుంది. అందులో,

“స్వామీ! ఈ ప్రపంచంలో మీరు తప్ప నాకు వేరెవరూ లేరు. నేనీ ప్రపంచంనుంచి దూరం అవడంలోనే మీకు సుఖం శాంతి వుంది. అందుచేత యీ ప్రాణాల్ని సైతం లెక్కచేయక మీకోసం అర్పించాను. నా వల్ల జరిగిన పొరబాట్లను క్షమించాలని ప్రార్థన, భగవంతుడు మిమ్ములను సదా ఆనందమయులుగా చేయుగాక!”

ఈ లేఖ చదువుతూనే దేవదత్తుడు స్మృతితప్పి పడిపోయాడు, గోమతి అతని దగ్గరగాచేరి వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

# శ్రీ రామకర్ణామృతము

( ఆంధ్రానువాదము )

ద్వితీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు.



(గత సంచిక తరువాయి)

౨౧

అమృతాబ్ధిఁ దెలిదీవి యలరుచునుండు
నందు, శోభించును, చందనపారి
జాతముల్, కల్పవృక్షంబులు రెండు
గొప్ప పీఠంబొండు గొమరారు నచట
పన్నగ తల్పంబు చెన్నారు ; దాని
మధ్యలో, జానకీ మహిళా మనోహ
రుండు, వెల్గొందు ; నారూఢ మాభక్తి
నతనిఁ జింతింతు నేననవరతంబు

౨౨

చిఱునవ్వు మోమునఁ జిందులాడెడివాఁడు
రమణీయ పద్మ నేత్రములవాఁడు
నీలంపు మణుల, మించిన శరీరమువాఁడు
శర చాపములతోడ వరలువాఁడు
సూర్య వంశాబ్ధిలో, సొబగు కౌస్తుభమణి
కరణిఁ బ్రకాశించి గ్రాలువాఁడు
డంబుగా మెఱయు, జటా కిరీటంబుల
నానందమూర్తియై యలరువాఁడు
వాఁడు మావాఁడు శ్రీరామ వల్లభుండు
చందనము, మేనఁ బూసిన యందగాఁడు
నిత్య సంతోషమూర్తియై నెగడువాఁడు
నన్ను రక్షించుగాత! ప్రసన్నుఁడగుచు

౨౩

పుష్పబాణంబుచేఁ బొలుపొందు, చెఱకు వి
ల్లును, రెండు చేతులలో ధరించి
చక్రశంఖములు పాశంబంకుశము, వంశ
నాళంబుఁ దక్కిన నాల్గు, రెండు
కరముల వరుసగా ధరియించి, సూర్యుని
రంగుతో శోభిల్లి రామ ! నీవు
శ్రీ కృష్ణరూపుఁడై చెన్నారుచుందువు
నీలమేఘశ్యామ ! నీరజాక్ష !
రామచంద్ర ! దయాకర ! రాఘవేశ !
నిన్ను భజియింతు, స్తుతియింతు సన్నుతాంగ
నామనోదుఃఖముల బాపి నవ్యశుభము
లందఁజేయుము ; శ్రీశ! ముకుంద! వరద!

౨౪–౨౫

పెక్కు పాదములతో–పెక్కు తొడలతోడ
పెక్కు కడుపులతోడ-విశ్వరూప !
బహు మొగంబులతోడ–బహు బాహువులతోడ
బహు నేత్రములతోడ–పంకజాక్ష !
పెక్కు శీర్షములతో–పెక్కు చేతులతోడ
పెక్కు వదనముల భీమరూప !

బహు దేవతలతోడ-బహు సర్పములతోడ
తీక్ష్ణాగ్నివలె వెల్గు దివ్యరూప!
కోటి సూర్యుల మించెడి మేటి తేజ!
పూలహారముల్, గంధంపు పూతలోడల
గల్గిన, యనంత వీర్యుఁడౌ కమల నయన!
విశ్వరూప! శ్రీరామ! నీకు వినుతిసేతు.

౨౬

కోదండ బాణముల్ కొమరొప్పఁబట్టి
గదయు, శంఖముగల్గి, కడు భయంకరము
లకు, కోరలనుజూపి, యగ్నులఁగక్కు-
నాననంబుల నొప్పు, యంబుజ నయన!
పచ్చని పుట్టంబు, పైడి కిరీట
మును, కుండలంబులఁ బొలుపారఁదాల్చి
విశ్వరూపముబూని వెలుగొందు రామ!
భజియింతు నిను సదా భక్తిభావమున

౨౭

స్మరుని పంచ బాణంబులు, చాంప మంకు
శంబు, శంఖంబు చక్రపాశములు, వేణు
దండ మెన్మిది చేతులఁదాల్చిఁ నూత్న
మణుల కాంతిని గల్గి, రమా వినోది
యగుచుఁ బ్రద్యుమ్నుఁడై, నల్ల నయ్య
యైన
రామచంద్రుని భజియింతు రక్తితోడ.

౨౮

సీతఁగాంచుట యందు ప్రీతి వహించెడి
నీలమణి శరీర! నిగమ వినుత!
ఎడమ మోకాలిపై నిడిన హస్తముగల్గి
వీరాసనముబూని వెలయురామ!
కల్పవృక్షముక్రింద, కమలాసనుండు, సప్త
ఋషులు, నీకు భజియించి మ్రొక్కు-
చుండ
ముత్యాల హారంబు-ముద్దు కిరీటంబు
కుండలంబులదాల్చి కొలువు దుండ
నగుచు, బోధముద్ర ధరించి, యాప్తభక్త
వరులకెల్లను జ్ఞానతత్త్వంబు దెలిపి
హర్ష వారిధి దేల్చు పట్టాభిరామ!
సేవ సలిపెద రక్షింపు శ్రీ శుభాంగ!

౨౯

మునుల కెవ్వని మూర్తిసన్మోద మొసంగు
నెవని బాణము దితిజాళియేపచుండు?
నెవడు నరలోక హృద్వీధి నెసగుచుండు?
నట్టి సర్వస్వరూపుఁడౌ యమల చరితు
శ్రీ శుభాంగుని రఘురాము సేవఁజేతు

౩౦

వేదాంతములయందు-వెల్గుచున్నా వీవు!
ఓంకార వాచ్యుఁడై యొప్పు దీవు!
నాదప్రియుండయి-మోదమందెద వీవు!
ఆకార రహితుఁడై యలరెదీవు!
వేదాంబుజ, మరంద మాదరంబున గ్రోలి
మత్తిల్లుచున్నట్టి మధుపమీవు!
క్రొత్త మేఘపు నీలరుచులతో శోభిల్లు
దేహ కాంతిని గల్గు దివ్యుఁడీవు!
నామములు, పెక్కులుండియు, నామ
రహితుఁ
డగుచు, నంతరాత్ముండయి, యలరు దీవు!
ఆశ్రితుల రక్ష సలిపెడి యభయమూర్తి!
శ్రీశ! తారక రామ! రక్షింపుమయ్య!
(సశేషము)




# రంగడు — రాకుమారి

శ్రీమతి కొండూరి రామసీతమ్మ

(గత సంచిక తరువాయి)

—X—

రంగడికి మిత్రుడు చెప్పినదంతా వినేసరికి అతనిలో ఎలాగయినా రాకుమారిని చూడాలనెడి కాంక్షయిను మడించింది. ఆలాగే కులాసాగా మిత్రులతో కొంత కాలం పూల రంగడులాగా వెలిగాడు. త్రాగుడు మిత్రులు, జూదం వలన వున్న డబ్బంతా మంచినీళ్ళ లాగా ఖర్చు అయింది. చివరకు దమ్మిడీ లేకుండా పోయింది. స్నేహితులలో ఒక్కడుగూడా రంగడికి కానీ ఖర్చుపెట్టేవాళ్లు లేరు. పైగా వాళ్ళంతా క్రమ క్రమంగా జారుతున్నారు. తన బూట్లను తనే తుడుచుకునేవాడు. ముందు వాటిని శుభ్ర పరచేదానికి ఒక నౌకరు వుండేవాడు. తనకు గుడ్డలు ఇస్త్రీకి డబ్బు లేదని తనే వుతుక్కునేవాడు. ఇలా కొన్ని రోజులు గడిచినవి.

ఒక రోజు సాయంత్రం గదిలో కూర్చుని ఏమి చేయటమాయని ఆలోచిస్తున్నాడు రంగడు. ఇంతలో ఆతడికి పాతరేకుడబ్బా సంగతి జ్ఞాపకంవచ్చింది. గబగబా పెట్టెతెరచి దానిలోంచి డబ్బాను బయటికితీసి ఆ డబ్బామూతను తెరవటానికి ప్రయత్నించాడు. కానీ అది ఎంతసేపటికీరాలా. చివరకు విసుగెత్తి ఒకనల్లకంకర రాతితో దాని మూతను కొట్టాడు. వెంటనే పెద్ద నిప్పురవ్వ పడింది. ఆ పెట్టె మూత తెరుచుకుంది. అందులోనుంచి తను పూర్వం మొదటి గదిలో చూచిన కుక్క నారింజ కాయలంత కళ్ళది—బయటికి వచ్చి "స్వామీ సేవకునకు ఏమి ఆజ్ఞ?" అంది మానవ కంఠంతో. రంగడికి అమితాశ్చర్యం కల్గింది. "అరె అంతా విచిత్రంగా వుందే. ఈ పెట్టెకు గొప్ప మహిమవుందలే వుందే. నేను ఏది తలచుకుంటే అది సిద్ధించేటట్లుంది." అని తలచి రంగడు ఆ కుక్కతో "నాకు డబ్బు కావాలి. తక్షణం తీసుకురా" అన్నాడు ఆ కుక్క మాయమయి మరుక్షణంలో ఒక పెద్ద సంచి నిండా రాగి నాణెములతో ప్రత్యక్షమయింది. ఆ సంచీని రంగడి ఎదుట నుంచి అది మాయమయింది. అప్పటికి రంగడికి ఆ పెట్టె మహిమ పూర్తిగా బోధపడింది. ఆ పెట్టెను ఒక్కసారి రాతితో కొడితే మొదటి గదిలోని కుక్క ప్రత్యక్షం అవుతుంది, రెండు సార్లు కొడితే రెండవ గదిలోని కుక్క, మూడుసార్లు కొడితే మూడవగదిలోని కుక్క ప్రత్యక్షం అవుతుందని రంగడు అట్టె గ్రహించాడు.

వెంటనే రంగడు ఆ డబ్బాను రాతితో రెండు తడవలు కొట్టాడు. మూత తెరుచుకుంది. రెండవ గదిలోని దబ్బకాయలంత కళ్ళ కుక్క ప్రత్యక్షమయింది. దానిని గూడా డబ్బు తెమ్మని చెప్పాడు. ఆ కుక్క కూడా ఒక సంచినిండా వెండి నాణెములు పోసుకొచ్చి రంగడి ఎదుటనుంచి మాయమయింది. తిరిగి

డబ్బాను మూడుసార్లు కొట్టాడు. మూడవ గదిలోని తాటికాయలంత కళ్ళకుక్క ప్రత్యక్షమయింది. దాన్ని కూడా డబ్బు తెమ్మని చెప్పాడు రంగడు. ఆ కుక్క వెంటనే ఒక మూట బంగారు నాణెములు తెచ్చి రంగడి ఎదుట నుంచి మాయమయింది. ఆ డబ్బుతో రంగడు తిరిగి మామూలు విలాస జీవితాన్ని ప్రారంభించాడు.

## 2

రంగడికి కాలం గడచినకొద్దీ రాకుమారి స్మరణే అధికమయింది. ఎవ్వరినీ ఆమెను చూడనీయకపోవటం అతిదారుణమని తలచాడు. ప్రతివాడూ ఆమె అప్సరసయని అంటారు గానీ ప్రత్యక్షంగా చూచినవాళ్లు ఎవ్వరూలేరు. ఆమెను ఎలాగయినా చూడాలని ధృఢంగా నిశ్చయించుకున్నాడు. ఎలా చూడడం? అనేక విధాల ఆలోచించాడు. ఏమీ పాలుబోలా. చివరకు పాత రేకుడబ్బా జ్ఞాపకం వచ్చింది సంతోషంతో ఎగిరి గంతేసి డబ్బాను తీసుకుని రాతితో కొట్టాడు. వెంటనే మొదటి గదిలోని కుక్క ప్రత్యక్షమయి "స్వామీ సేవకునకు ఏమి ఆజ్ఞ?" అంది.

"ఇప్పటికే కాలాతీతం అయింది. అయినా ఫరవాలేదు. వెంటనే వెళ్ళి పట్టణపు రాజుగారి కుమార్తెను నా ఎదుటకి తీసుకురా" అన్నాడు.

ఆ కుక్క 'సరే' అన్నట్లు గాతలవూపి మాయమయింది. మరుక్షణంలో రాకుమారిని భుజాన వేసుకుని రంగడి ఎదుట ప్రత్యక్ష మయింది. రంగడు ఆమె సౌందర్యాన్ని ప్రత్యక్షంగా చూచి ముగ్ధ డయ్యాడు. ఆమె ముల్లోకాలనూ సమ్మోహింపగల సౌందర్యవంతురాలని తలచాడు. ఆమె సౌందర్యమునకు రంగడు అచ్చెరు వందాడు. కొంతసేపు ఆమెకేసి చూస్తూ బొమ్మలాగా నిలబడ్డాడు. కొంతసేపటికి తెప్పరిల్లుకొని ఆమె చేతిని ముద్దాడాడు. ఆ రాకుమారి గాఢ నిద్రలోవుంది. కుక్క మోసుకొచ్చినదిగానీ రంగడు ఆమెను ముద్దాడినదిగానీ ఆమెకు తెలియదు. ఎక్కువ సేపు రాకుమారి తన గదిలో నుండుట ప్రమాదమని తలచి రంగడు వెంటనే కుక్కను తీసుకువెళ్ళమన్నాడు. ఆ కుక్క ఆమెను వీపున ఎక్కించుకుని మాయమయింది. మరుక్షణంలో రాకుమారి యథా ప్రకారం తన భవనంలో పాన్పుమీద మామూలుగా నిద్రపోతోంది.

మరునటిరోజు ఉదయం రాకుమారితో భోజనానికి మహారాజూ, రాణీ వచ్చారు. భోజనమధ్య రాకుమారి తండ్రితో గతరాత్రి తనకొక వింత కల వచ్చిందని చెప్పింది. కలలో తను ఒక కుక్క మీద స్వారీ చేసినట్లు చెప్పింది. ఆ కుక్క తనను ఒక సామాన్య సిపాయి గదికి తీసుకుపోయినట్లు, ఆ సిపాయి తన చేతిని ముద్దిడుతున్నట్లుగానూ చెప్పింది. చాలా వింత కలయని తలచారు. తల్లిదండ్రులు ఎందుకయినా మంచిదని ఒక ముసలి దాసిని 24 గంటలూ ఆమెను విడువక ఆమె ప్రక్కనే పడుకోమని నియమించారు.

రెండవ రోజు రాత్రి రంగడికి రాకుమారిని చూడాలని బుద్ధి పుట్టింది. వెంటనే రేకుపెట్టెను రాతితో కొట్టాడు. కుక్క ప్రత్యక్షమయింది. రాకుమారిని తన ఎదుట హాజరు పరచమని ఆజ్ఞ ఇచ్చాడు. వెంటనే కుక్క మాయమయి మరుక్షణంలో రాకుమారితో ప్రత్యక్షమయింది. ఆమె ప్రక్కన పడున్న ముసలి దాసీ కుక్కతో రాకుమారిని తీసుకుపోవటం గమనించి దానిని రహస్యంగా వెంబడించింది. ఆ ముసలి దాసీ కుక్క వెనకాలే రంగడున్న యింటికివచ్చి ఆ యింటికి గోడకు సున్నం ముక్కతో '×' గుర్తును పెట్టి మరల కోటలోకి వెళ్ళి పడుకుంది. కొంత సేపటికి రాకుమారిని మోసుకువచ్చి ఆమె ప్రక్కమీద పడుకో బెట్టి తిరిగి రంగడి ఇంటికి వచ్చింది. ఆ యింటి గోడమీద క్రొత్తగా సున్నంతో '×' మార్కు ఉండటం గమనించి అదేదో ప్రమాద సూచనయని తలచి ఆ పట్టణంలోని అన్ని ఇండ్లకూ ఆ మాదిరిగా మార్కు వేసి మాయమయింది.

(సశేషము)

# రేడియో రగడ

రచన : "శ్రీ భగవత్కుమార"

—o—

"ఏమండీ పండుగకు ఎప్పుడు వెడదాం ?" నిర్మల అన్నం వడ్డిస్తూ అంది.

"నీ యిష్టం రేపు నిన్ను పంపిస్తాను నీవు వెళ్లు" అన్నాడు రామం.

"నన్ను పంపించట మేమిటండీ. మనిద్దరం శ్రేప్రొద్దుటే వెడదామంటేనూ. పోయిన దసరాకుకూడా రాలేదని నాన్న ఎంతో బాధపడ్డాడు. ఆయన బాధ మీ కేం తెలుస్తుంది ? నామాట వినండీ రేపు మనిద్దరం వెడదాం. సరేనా !" అంది.

"అంత పండుక్కు రావాలనుకున్న వాడు ఆ రేడియో నే కొని పెట్టకూడదూ! పెళ్లిలో యిస్తానన్నాడు. ఇంతవరకూ గతిలేదు" వున్న అక్కసు అంతా వెళ్లగ్రక్కేడు.

రేడియో విషయం భర్త బయట పెడతాడని ఎప్పుడో అనుకుంది, నిర్మల అనుకున్నట్లుగానే జరిగింది.

"నాన్న పరిస్థితి మీకు తెలియంది ఏముంది చెప్పండి. లేమిడి సంసారం. పెళ్లిలో ఆ నాలుగు వేల కట్నం యివ్వటానికే వున్న పొలం కాస్తా తాకట్టు పెట్టవలసి వచ్చింది. ఇప్పటికిప్పుడు రేడియో కావాలంటూ మొండిపట్టుతో కూర్చుంటే ఎలా చెప్పండి? ఇదేమయినా పాతరా ! త్రవ్వి పట్రావటానికి. వసతి చూసుకొని తప్పకండా కొని పెడతానన్నాడుగా, నామాట వినండి. మనిద్దరం వెడితే వాళ్లకు కడుపు నిండినట్లుగా వుంటుంది —" అంది నిర్మల.

"నాయిష్టం నాదీ. నిన్నె వడూ వాళ్ల తరఫున వకాల్తా పుచ్చుకుని చెప్పమని యాడవ లేదు-" అన్నాడు.

"మీ రెంత మూర్ఖులండీ! చదువుకున్నారు బి. ఏ. ఎందుకూ! ఎదుటివారి హృదయాన్ని అర్థం చేసుకోలేరు." అంది.

"నిర్మలా !"

"లేకపోతే ఏమిటండీ యీ మొండిపట్టు" అంది.

రామం నిర్మల చెంప చెళ్లు మనిపించాడు. నిర్మల ఏడుస్తూ కూర్చుంది. రామం చీకాగ్గా గొణుక్కుంటూ బయట కెళ్లిపోయాడు.

ఆ రాత్రి నిర్మలకు సరిగా నిద్ర పట్టలేదు. మనసంతా పుట్టింటమీదవుంది. రామం చూస్తే యిలా మొండిగా ప్రవర్తిస్తున్నాడు ఎలాగైనా పుట్టింటికి వెళ్ళాలనుకుంది. ఎంతయినా స్త్రీకి కన్న యింటి మీద వుండే వాత్సల్యం అటువంటిది. భర్త రాకపోతే తన తల్లితండ్రీ బాధ చెందుతారు. రేడియో కొనందే ఆ పట్టు వదలడు ? "చెడిపోయిన

వాళ్ళేదో చెడిపోయారు. ఈ ఒక్క రేడియోతో ఇంక ఎక్కువగా చెడిపోయేది ఏముంది? ఎలాగో నాన్న కాళ్ళావేళ్ళాపడి ఆ రేడియో కొనిపిస్తాను. అప్పుడు కొనక ఏంచేస్తాడు? రేడియోను గురించి రగడ పెరగటం నాన్నకు మాత్రం ఇష్టమా? ఈ ఆలోచన స్ఫురించేసరికి హాయిగా నిద్రపోయింది నిర్మల.''

తెల్లవారింది. నిర్మల నవ్వుతూ పని చేసుకుంటుంది. ''రామం నిర్మల నవ్వు మొహాన్నిచూసి వింతపోయాడు. రాత్రి తన్నులు తింది. ఇవ్వాళ యీ నవ్వు మొహం! ఆడవారు నవ్వుకు విపరీతార్ధమేదో వుండివుంటుంది'' అని అనుకుంటూ నిర్మల దగ్గరకొచ్చాడు.

''ఏమండీ! యివ్వాళ తప్పకండా వెళ్లి తీరాలి'' అంది.

''నేను రాను!''

''రాకపోతే కుదరదు! మీకు రేడియో ఇప్పించే బాధ్యత నాది'' అంది.

రామం ఆశ్చర్యపోయాడు. ''సరే నాకు రేడియో ఇప్పించక పోవాలి - వుంటుంది రగడ! నీమాట నీవు దక్కించకపోతే నలుగురిలోనూ మీ నాన్నను రచ్చపాలు జేయనూ! పద. ఏ మాత్రం మాట నిలబెట్టుకుంటావో చూస్తాను.'' అంటూ బండికోసం బజారుకు బయలు దేరాడు. నిర్మల నిరుత్తరురాలయింది.

అల్లుడూ కూతురూ రావటంతో వాళ్ళ మనసు ఆనంద పులకితమైంది. రామాన్ని మామగారు పలకరించి లోపలకు తీసుకెళ్లారు.

నిర్మల తండ్రితో రేడియో విషయం చెప్దామని ఎప్పటికప్పుడు ప్రయత్నిస్తునే వుంది. కళ్లారా తండ్రి కష్టాలనుచూస్తూ అడగటానికి మనసొప్పిందికాదు. అడుగక పోతే భర్త రగడ చేయక మానడు. అడగటానికి మనసొప్పటంలేదు. ఏం చేయటమో తోచలేదు.

ఆ వుదయం రామం బద్ధకంగాలేచి మొహం పుల్ల తీసుకొని బయటకు వెళ్లాడు. మామగారూ మరొక మనిషీ ఘర్షణ పడటం కళ్ళారా చూశాడు. ఆ రెండవ మనిషి వెంకయ్యగారని నిముషంలో పోల్చుకున్నాడు.

''నా మాట వినండి వెంకయ్యగారూ! వచ్చే యేడు మీ బాకీ మొత్తం చెల్లు వేస్తాను. ఈయేటికి మాత్రం వూరుకోండి.'' అంటున్నాడు మామగారు.

''ఆ వ్యవహారమంతా నాకు కుదరదయ్యా. ముందు బాకీ చెల్లు వేయాల్సిందే కూతురు పెళ్ళికని నాలుగువేలు బాకీ తీసుకున్నావ్. మూడేళ్ళు కావస్తున్నా చెల్లు వెయ్యకపోతే ఎల్లా.'' అన్నాడు వెంకయ్య. వెంకయ్యను బ్రతిమాలి బయటకు పంపే

సరికి ఆయన తలప్రాణం తోక కొచ్చినంత పనయింది. ఇంతలో బంగారపుకొట్ల బ్రహ్మయ్య వచ్చి మామగారిని నిలవేశాడు.

"వచ్చేయేడు పంటంతా మీదే బ్రహ్మయ్యగారూ! మా గతి ఏదో మేం పడతాం. వచ్చే యేడు కళ్ళంలో గింజ లమ్మి మీ బాకీ తీరుస్తాగా-మన్నించండి షావుకారుగారూ!" వేడుకుంటాడు మామగారు.

"ఏమిటయ్యా నీ కూతురు పెళ్ళికి పెట్టిన నగల ఖాతా యింతవరకూ పైసా చెల్లించలేదు' లాభంలేదు. నా బాకీ తీరుస్తే తీర్చు; లేకపోతే నీ యిల్లు వాకిలీ వేలం వేస్తా"నంటూ కూర్చున్నాడు.

ఇంతలో బట్టలకొట్టు భూషయ్యగారు వచ్చి "ఏందయ్యోయ్! వచ్చే యేడాది పంటంతా ఆయనకే కట్టపెడతానంటున్నావ్. మరి పెళ్ళికని తీసుకున్న బట్టల బాకీని ఏం జేస్తావ్?" నిలదీసి అడిగాడు. "షావుకారుగారూ! నా మాట వినండి. మీకు ముందుకు చెల్లిస్తాను. ఇప్పుడు నా దగ్గర చిల్లిగవ్వకూడా లేదు. బ్రతిమాలుకుంటున్నాను షావుకారుగారూ! అవతల అల్లుడుకూడా వున్నాడు. నన్నల్లరి పెట్టకండి" అని వారిద్దర్నీ సాగనంపేసరికి వెంట్రుకలు నరిసినంత పనయింది.

రామం నిలువునా నీరయిపోయాడు. మామగారి పరిస్థితిని కళ్ళారా చూసేసరికి అతని మనసు మారిపోయింది. అనవసరంగా రేడియోనుగురించి ఆయన మనసును ఇంకా బాధపెట్టటం భావ్యం కాదనే భావం వుదయించింది. మామగారు దిగులుపడి లోపలకు వస్తూ "అవతల అప్పుల బాధలు అల్లా వున్నాయి; ఇవతల అల్లుడు రేడియో కావాలంటూ కూర్చున్నాడు. నా బ్రతుకు ఇంకా ఎంత నవ్వుల పాలు కావలసి వుందో." అని గొణుక్కుంటూ లోపలకు పోయాడు. ఆ మాటలు వినగానే రామంగుండెలు నిలువునా నీరయిపోయింది. "ఛీ! ఎంత మూర్ఖంగా ప్రవర్తించాను. అనవసరంగా నిర్మలనూ, మామగారి మనస్సునూ నొప్పించాను" అని బాధపడ్డాడు. ఆ రాత్రి నిర్మల భర్త గదిలోకి వచ్చింది. భర్త ఏదో ఒక విధంగా వున్నాడు. "ఇవ్వాళ నాన్నతో చెప్పాను. ఆ వున్న నాలుగు బస్తాలవడ్లు అమ్మి రేడియో తీసుకొస్తానన్నారు. సరేనా?" తెచ్చిపెట్టుకున్న నవ్వుతో అంది నిర్మల.

రామం కళ్లవెంట అశ్రువులు రాలినయ్. "నన్ను క్షమించు నిర్మలా. మూర్ఖంగా ప్రవర్తించి నీ మనస్సునూ, ఆయన్నీ కష్టపెట్టాను. ఇవ్వాళ ఉదయం మామగారి

52-వ పేజి చూడుడు



# పిచ్చిరాధ

"ప్రమద"



"అతను సందుమలుపు తిరుగుతున్నాడు. అవును! ప్రతిసారి తిరుగుతాడు. అతనెవరు? అతన్ని మాస్తే నాకెందు కింత ప్రేమ?" అనుకుంది రాధ. రాధ వకీలు కామేశ్వర రావుగారి కూతురు. ఇంటర్మీడియట్ పాసయింది. ఇక చదువుదామనుకున్నా తల్లి కిష్టములేక పోవటమువలన ఆగింది చదువు.

ఇన్నాళ్లు రాధ మామయ్య దగ్గిర ఉండి చదివింది. ఆయనకు పిల్లలు లేరు. రాధ అంటే ప్రేమ. అందుకని స్కూలు ఫైనలు పేసవగానే వచ్చి తీసికెళ్ళాడు.

రాధవచ్చి షుమారు పదిహేను రోజులయింది. ఈ పదిహేను రోజుల్లో ప్రతిరోజు అతన్ని చూస్తుంది. అతనెవరో తెలియదు? కాని రాధకి అతను ఆత్మీయుడుగా కనపడ్డాడు.

తనకి తెలియకుండానే ప్రేమించింది. అతను కనీసము తనవేపైనచూడడు. ప్రతిరోజు ఆశగా అతనివంక చూస్తుంది. అతనొక్కడే తలవంచుకొని పోతాడు. అతనిపక్కన సాధారణంగా స్నేహితులుండరు.

ఓ రోజు ధైర్యముచేసి అడిగింది రాధ "ఏమండీ! మీ దగ్గర ఏమన్నా పుస్తకాలుంటే ఇస్తారా? మళ్ళీ సాయంత్రము ఇచ్చేస్తాను. ఏం తోచటంలేదు."

"దానికేం" అంటూ ఓ పది పత్రిక లేవో తెచ్చాడు వాటిలో కనీసము ఒకటీ చదవలేదు! సాయంత్రము ఇచ్చేస్తూ, "థాంక్స్. మీ పేరు?" అంది. "కృష్ణమూర్తి" అన్నాడు అతడు. "వస్తానండి" చెప్పివెళ్ళిపోయాడు.

"అబ్బ! ఇంకొంచెమునేపుంటే బాగుణ్ను." అనుకుంది రాధ.

ఆ మర్నాడు అతను మరో అందమైన అమ్మాయితో వెళుతున్నాడు. రాధ చాలబాధపడింది. "ఆ అమ్మాయి ఎవరో? అతను, ఆ అమ్మాయి ఉత్సాహంగా నవ్వుకుంటూ పోతున్నారు. వాళ్ళిద్దరూ భార్యభర్తలే!" అనుకుంది.

గబ గబ రూములోకివచ్చింది. డ్రాయరు ముందర కూర్చుని దీర్ఘంగా ఆలోచిస్తున్నది. "తనది భగ్నప్రేమ. తను అంతగా అతన్ని ప్రేమిస్తుంటే అతను మరొక యువతితో! సహించలేను." అనుకుంది రాధ.

"ఓ రాధమ్మ, కృష్ణుణ్ణి తరువాత తలచుకుందువు గాని ఇటుచూడు" అన్న తండ్రి పిలుపు విని ఉలిక్కిపడింది. కళ్ళు తెరిచి చూసింది.

"అన్నయ్య అరే! ఎప్పుడొచ్చేశావు?" అంది

"ఇప్పుడే! వాడొచ్చిందికూడ తెలిదన్నమాట" తండ్రిమాటవిని జవాబు చెప్పలేక ఊరుకుంది.

---

(51-వ పేజి తరువాయి)

పరిస్థితిని చూసేసరికి నామనసు మారిపోయింది. నాకు రేడియో అక్కరలేదు. నన్ను క్షమించమని మామగారిని వేడుకొంటాను. ఇప్పుడు ఎదుటవారి కష్టమంటే ఏమిటో అర్థమయింది నిర్మలా!" అన్నాడు రామం గాద్గదికంగా. రామంలోకల్గిన యీ మార్పును చూసి నిర్మల ఆశ్చర్యపోయింది. "ఇదంతా నా అదృష్టం!" అంది ఆనంద భాష్పాలు రాలుస్తూ.

అన్నయ్య, నాన్న గదిలోంచి వెళ్ళారు.

అరే, అన్నయ్య ఎవర్నో పిలుస్తున్నాడే!

వాకిట్లోకి వెళ్ళింది. అన్నయ్య కృష్ణ మాట్లాడుకుంటున్నారు.

"ఈ అమ్మాయి ఎవరోయ్?" అన్నయ్య ప్రశ్న

రాధ ఆత్రంగ వింటున్నది.

"మా చెల్లెలోయ్. నా దగ్గర రెండు నాళ్ళు ఉంటానికొచ్చింది" అన్నాడు అతను.

"నువ్వు రూములో ఉంటున్నావా?" అన్నయ్య ప్రశ్నకు

"అవును" జవాబు ఇది.

"అయితే మా చెల్లెలును పంపుతాను. ఏదైన చెప్పవోయ్"

"మీ చెల్లెలా?" అన్నాడు అతను.

"అవును. రాధ." అన్నాడు అన్నయ్య.

వాళ్ళిద్దరు నిష్క్రమించారు.

రాధ అన్నయ్యతో సంగతంతా చెప్పింది.

అన్నయ్య పక పక నవ్వేడు.

తరువాత కృష్ణకి, రాధకు పెళ్ళయిపోయింది.

రాధ పడుకోబోయేటప్పుడనుకునేది.

"ఆనాడు నిజంగా విషం తింటే?" అనుకున్నప్పుడల్లా ఆమె వళ్ళు జల్లుమనేది.

"అబ్బ! ఎంత బాగుంది కథ" అనుకుంది రాధ.

"ఎవరో అచ్చంగా మా కథ"

టైము ఆరయింది.

"ఇక సినిమా ఛాన్స్ లేదుగా!" అనుకుని లోపలికెళ్ళింది.

కృష్ణ నెమ్మదిగా ఉప్మా తింటున్నాడు.

"ఎప్పుడొచ్చారండి!" అంది. అతను ఎలా తనకు తెలియకుండా వెళ్ళాడా అని ఆశ్చర్యపడుతు.

"అవును, నేను కథ చదువుతున్నాను." అని తృప్తి పడింది.

"ఏది ఆ కథ! అంతగా దాంట్లో మునిగావ్ నన్ను చదవనియ్." అన్నాడు.

"ఎందుకులెండి" అంది. "అన్నట్టు సినిమా?"

"లేదు"

"ఎందుకని!"

"తైలము లేదు."

"మీ దగ్గర ఎప్పుడుంది?"

"ఎల్లుండేళ్ళదాము?"

"అహ! ఇంకో సంవత్సరానికి సరేనా?" కోపంగ.

"సరే" అని తలఊపాడు కృష్ణ

రాధ విసురుగ ఆ గదిలోంచి వెళ్ళిపోయింది.

మర్నాడు మధ్యాహ్నము కృష్ణకి ఓ చిన్న బుక్ పోస్టు వచ్చింది. దాంతో పదిరూపాయల మనీయార్డరు వచ్చింది రెండు తీసుకుని, లోపలి పత్రిక తీసేసరికల్లా ఓ చిన్న కాగితము ముక్క కింద పడింది.

"మీరు వ్రాసిన కథకు" అని ఉంది.

"అయితే కృష్ణ అన్న పేరుతో వ్రాస్తున్న కథలు ఈయనవేనా?" అనుకుంది ఆశ్చర్యంగా!

ఆ రాత్రి ఇద్దరు సినిమాకెళ్ళారు.

(536 పేజి తరువాయి)

కన్నా అనుగుణమైనది. అక్కడి వారు కేవలం దీనిని భజనలనే ఉపయోగిస్తారు.

"కృతి" ఆవిర్భావానికి నాందీ ప్రస్తావన ౧౨ వ శతాబ్దంలో జయదేవ మహాకవి చేశాడని చెప్పవచ్చు. ఆయన "గీత గోవిందం"లో ఈ ఛాయలు కనబడతాయి. ఆ తరువాత ౧౫ వ శతాబ్దినాటి తాళ్లపాక చిన్నయ్యగారి కృతులు చెప్పుకోవాలి. ఒక విధంగా ఇవే మొట్టమొదటి కృతులు అని చెప్పవచ్చు. ఆధునిక కృతి, ఆనాడే ఇప్పటి రూపాన్ని ధరించినట్లు విదితమవుతుంది. ఈ కృతులు అప్పట్లో వేలాదిగా ఉండేవని పరిశోధకులు చెబుతారు కాని బహుకొద్ది మాత్రమే లభిస్తున్నాయి. ఈ కృతికలలో తరువాత వచ్చిన మహనీయుడు భద్రాచల రామదాసు. రామదాసు తన పరదైవమని త్యాగరాజస్వామి అంతటివాడే ఒక సందర్భంలో చెప్పుకొన్నాడు. పదెనిమిదవ శతాబ్దారంభం వరకూ సంగీతం, అక్షరాలా భక్తిసాధనకు ఒక రూపం మాత్రమే అనవచ్చు. ఆ తరువాతనే విద్వాంసులు, సంగీత శాస్త్రకారులూ, అప్పటికి లభ్యమైన కృతి కీర్తనాదులన్నిటినీ సేకరించి వాటి స్వరూప స్వభావాలు కూలంకంగా పరిశోధించి వర్ణీకరించి, సంగీత శాస్త్ర ప్రతికి దోహదం చెయ్యడం కోసం, సంగీతానికి ఒక నిర్దిష్ట శాస్త్ర స్వరూపాన్ని ఏర్పరచడం జరిగింది. గానానికి రాజపోషణ ఆరంభం కావడంతో కొత్త అధ్యాయం ప్రారంభమయింది. గాయకులకు ప్రోత్సాహం లభించింది. అప్పట్లోనే దేవాలయాలలో జరిగే పూజా పునస్కారాలకు, రాజ సభలలో జరిగే మతసంబంధమైన ఉత్సవాలకూ, సరస్సులకూ సంగీత కార్యక్రమం ఏర్పాటుచేయడం పరిపాటి అయిపోయింది. వీటన్నిటికీ వచ్చే వేలాది సామాన్య జనం అందరూ ఈ గాన సభలలో పాటల వాక్యార్థాలు గానీ, వాటి ప్రయోజనాలు గానీ అర్థం చేసుకోలేపోయినా కేవలం సంగీతాన్ని మాత్రమే విని ఆనందిస్తూ కూర్చొనేలాగ వారందరినీ ఆకట్టుకు రావడానికి ఆయాకృతులలో సంగీతం ప్రధానాకర్షణగా నిలపడం అవసరమైంది. ఇందుకోసం సంగీతంలో కొత్తకొత్త పద్ధతులు ఆరంభించారు. కొత్త పోకడలు కనిపెట్టారు. ఇవన్నీ ఆయా వ్యక్తుల శక్తినిబట్టి, ప్రజలను ఆకర్షించి ఆనందపరిచాయి. ఆదరణపొంది నిలచాయి. అనోటాఅనోటా విస్తరించాయి. ఇంచుమించు ఆ సమయానికే కష్టానికి ఫలం ఆశించిగానీ, అక్కరలేదనుకుని గానీ - మేళకర్తలు, రంగప్రవేశంచేశారు. వారు ఎన్నో కృతులనుచేశారు.

సంగీత శాస్త్ర పురోభివృద్ధి చరిత్రను పరికిస్తే ఒక సదిగతి వింతమవుతుంది. ఈ విద్యను రాజులు, ధనికులూ, పోషించి ప్రోత్సహించిన కాలంలో గొప్ప గొప్ప కృతికర్తలు ఉద్భవించారు. ప్రజాదరణ, ఉన్నరోజుల్లో గొప్పగొప్పగాయకులు ఉద్భవించారు. ౧౯ వ శతాబ్దం రెండవ భాగం కృతి కర్తల పాలిట స్వర్ణయుగం. ఆ కాలంలోనే సంగీతమూర్తిత్రయం- త్యాగరాజస్వామి, ముత్తుస్వామి దీక్షితర్, శ్యామశాస్త్రి - అసంఖ్యాకమైన కృతులురచించారు. అటువంటి శాస్త్రబద్ధమైన కృతులు అసంఖ్యాకంగా లభించడంతో వాటికి ప్రజాదరణ హెచ్చింది. సర్వత్రా సంగీతాభిమానం వ్యాపించింది. తత్ఫలితంగా ఈనాటి "గానసభ" ఆనాడు ఆద్భవించింది. ఈ విధంగా కేవలం ఈశ్వరార్చన సాధకంగానే కాకుండా, వినోద కాలక్షేపానికి యోగ్యమైన స్థాయిని సంపాదించడంతో సంగీతానికి ఆవధులు పెరిగాయి. కొత్తకొత్త రూపాలు కలసివచ్చాయి. సరిగ్గా అదే సమయానికి, "కృతి" రూపం ధరించి అంది వచ్చింది. శ్రోతల సంఖ్య పెరగడంతో గాయకులూ పెరగారు. ఈ గాన సభలలో గాయకుడికి రెండు విధాలయిన అవకాశాలు లభించి ఆనంద కారణాలయ్యాయి. ఒకటి, సామాన్య ప్రజానీకానికి శాస్త్రీయ సంగీతాన్ని అందించి ఆనందపరుస్తున్నామన్న తృప్తి. రెండవది తాను పాడేది ఇంకొక వాగ్గేయ కారుడి కృతినే అయినా, ఆ పాడటంలో, ఆత్మగతమైన ప్రతిభను చూపించి, తన

వ్యక్తిత్వాన్ని నిలిపి ఒక విధంగా దాన్ని తనదిగా అందించగలుగుతున్నామన్న ఆనందం.

ఉత్తరాదిన పాడే "ధ్రుపద్"కు, మన ఈ కృతికీ అనేక విషయాల్లో సామ్యం ఉంది. రెండూ రాగాలాపనతోనే ఆరంభమవుతాయి. కాగా ఆయా గాయకులు రాగాన్ని బహుధా విస్తరించి అల్లికలల్లి అనేక పోకడలుపోయి ఆ పాటకు, ఆ భావానికి ఒక విధంగా వ్యక్తిగతమైన నిర్వచనం చెప్పడానికి రెండిట్లోనూ అవకాశాలున్నాయి. దీనినే "మనో "ధర్మ" మంటారు. అయితే ఇలా స్వతంత్రించి రాగ, స్వరాలాపనలు సాగించినపుడు ఆయా రాగ లక్షణాలను అతిక్రమించకూడదు. పాటలోని మాటలను నిర్ణీత స్థానాలనుండి జరిపి ఇష్టమొచ్చినట్టు లయను భంగం చేయరాదు. ఈ రెండు రూపాలు, ఈ విధంగా "కల్పిత" "కల్పన" సంగీతాలకు ఆలవాలముల య్యాయి. "ఖయాల్"లో కూడా కల్పన సంగీతానికి అవకాశమున్నా ఇది ఉభయ లక్షణ లక్షితమైన "ధ్రుపద్"కి సాటికాదు. ఇందులో చెణుకులు, విసరడానికి అవకాశం హెచ్చు. అయినా నేటికి ఇది క్రమంగా దాని స్థానాన్ని, ప్రజాదరణనూ, తద్వారా గాయకుల అభిమానాన్ని కూడా పోగొట్టుకుని వెనకబడడం శోచనీయం. కృతిలాగే ధ్రుపదకి కూడా ప్రజాదరణ నిలచివున్నట్లయితే ఉత్తర దక్షిణ భారతాల సంగీత ప్రగతి కథ ఒకేవిధముగా సాగి ఉండును.

గాన సభల తీరుతెన్నులను మొదటినుంచి పరిశీలిస్తే దక్షిణభారత గాన సభలకు కృతి ఎంతముఖ్యమైనదో అవగతమవుతుంది. నేటి గాన సభల పద్ధతులు అరవై, డెబ్బై ఏళ్ళనాటివి. అంతకు ముందు గాన సభ మహా అయితే రెండుగంటలు జరిగేది. అందులో దాదాపు గంటన్నరసేపు రాగం, తానం, పల్లవుల ఆలాపనతోనే సరిపోయేది. మిగతా కాలంలో శ్లోకాలు, పద్యాలు పాడి ముగించేవారు. కాలక్రమేణా కృతి, రూపం ధరించిన తరువాత పద్ధతులు మారాయి. ఒక వర్ణం, మూడు నాలుగు కృతులు కూడా పాడేవారు. అయితే వాటిలో కల్పన సంగీతాంశం శూన్యం. ఉన్న పాటలు ఉన్నట్టుగా పాడేవారు. అవీ, ఒక విధంగా రాగం తానం పల్లవులకు నాందీ ప్రస్తావనగా ఉండేవి. అనాడూ, ఈనాడూ కూడా ఈరాగం తానం పల్లవులకే ప్రాధాన్యంఉంది. అయితే క్రమంగా కొంతమంది సాహసులదగ్గరగాయకులు, పల్లవి ఆరంభించే ముందర స్వతంత్రించి స్వరాలాపనచేసేవారు. కృతికి ముందర రాగాన్ని కూడా కొంతసేపు ఆలాపించేవారు. ఆ వేళ అవసరాలకు తగినట్టు త్యాగరాజ, దీక్షితర్, శ్యామ శాస్త్రిల కృతులు అంది వచ్చాయి. వేల సంఖ్యలో లభించాయి. ముఖ్యంగా త్యాగరాజ కృతులు ఈ దశలో ఎక్కువగా ఆదుకున్నాయి. గాయకులు కొత్తకొత్త రాగాలకు కృతులను గాన సభలో పాడి ప్రచారం చేయసాగారు. ఈ రూపేణా వారివారి వ్యక్తిగతమైన ప్రతిభను ప్రదర్శించుకోడానికి కృత్యారంభంలో రాగస్వరాలాపనలు ఎంతో దోహదంచేశాయి. ప్రజాదరణ ఎక్కువ కావడంతో, పల్లవి అనంతరం, అంత శాస్త్రీయం కాని లలిత సంగీతానికి స్థానం ఇచ్చి శ్రోతలను ఆకట్టుకోడానికి ప్రయత్నించడం అవసరమైంది.

ఈ విధంగా జావళీలవంటివి గాన సభల్లో వినబడసాగాయి. అరవై ఏళ్ల క్రితమే కృతులు ప్రచారంలోకి వచ్చాయి. క్రమంగా అవే, గాన సభల్లో మూడింట రెండు పాళ్ళ కాలం సంపాదించుకున్నాయి. వాటిలో కూడా త్యాగరాజ కృతులే ఎక్కువ. కర్ణాటక సంగీత సభాసంప్రదాయం తెలిసిన వారు ఈ నాటి గాన కచేరీలలో కృతిలేకపోతే ఎలా ఉంటుందో సులభంగా ఊహించుకోవచ్చు. కృతిలేని గాన సభ అర్థరహితమవుతుంది. అన్నంలేని భోజనం వంటిది. ఉత్తరాది వారికి "ధ్రుపద్" ఇటువంటిది. ఆదరణ కోల్పోయి వెనకబడ్డ ఈ ధ్రుపద్‌ను కూడా ఔత్తరాహ శ్రోతలు, గాయకులు, పునరుద్ధరించడానికి ప్రయత్నించి దాక్షిణాత్య సంగీతంలో కృతికి గల స్థానంలో దాన్నికూడా, నిలపడం వాంఛనీయం.

# కృతి–ఆధునిక సంగీతంలో దాని స్థానము

వ్యక్తిత్వాన్ని నిలిపి ఒక విధంగా దాన్ని తనదిగా అందించగలుగుతున్నా మన్న ఆనందం.

ఉత్తరాదిన వాడే "ద్రుపద్"కు, మన ఈ కృతికీ అనేక విషయాల్లో సామ్యం ఉంది. రెండూ రాగాలాపనతోనే ఆరంభమవుతాయి. కాగా ఆయా గాయకులు రాగాన్ని బహుధా విస్తరించి అల్లికలల్లి అనేక పోకడలు పోయి ఆ పాటకు, ఆ భావానికి ఒక విధంగా వ్యక్తిగతమైన నిర్వచనం చెప్పడానికి రెండిట్లోనూ అవకాశాలున్నాయి. దీనినే "మనో "ధర్మ" మంటారు. అయితే ఇలా స్వతంత్రించి రాగ, స్వరాలాపనలు సాగించినపుడు ఆయా రాగ లక్షణాలను అతిక్రమించకూడదు, పాటలోని మాటలను నిర్ణీత స్థానాలనుండి జరిపి ఇష్టమొచ్చినట్టు లయను భంగం చేయరాదు. ఈ రెండు రూపాలు, ఈ విధంగా "కల్పిత" "కల్పన" సంగీతాలకు ఆలవాలములయ్యాయి. "ఖయార్"లో కూడా కల్పస సంగీతానికి అవకాశమున్నా ఇది ఉభయ లక్షణ లక్షితమైన "ద్రుపద్"కి సాటికాదు. ఇందులో చెణుకులు, విసరడానికి అవకాశం హెచ్చు. అయినా నేటికి ఇది క్రమంగా దాని స్థానాన్ని, ప్రజాదరణనూ, తద్వారా గాయకుల అభిమానాన్ని కూడా పోగొట్టుకుని వెనకబడడం శోచనీయం. కృతిలాగే ద్రుపదకి కూడా ప్రజాదరణ నిలచివున్నట్లయితే ఉత్తర దక్షిణ భారతాల సంగీత ప్రగతి కథ ఒకేవిధముగా సాగి ఉండును.

గాన సభల తీరుతెన్నులను మొదటినుంచి పరిశీలిస్తే దక్షిణభారతగాన సభలకు కృతి ఎంతముఖ్యమైనదో అవగతమవుతుంది. నేటి గాన సభల పద్ధతులు అరవై, డెబ్బై ఏళ్ళనాటివి. అంతకు ముందు గాన సభ మహా అయితే రెండుగంటలు జరిగేది. అందులో దాదాపు గంటన్నరసేపు రాగం, తానం, పల్లవుల ఆలాపనతోనే సరిపోయేది. మిగతా కాలంలో శ్లోకాలు, పద్యాలు పాడి ముగించేవారు. కాలక్రమేణా కృతి, రూపం ధరించిన తరువాత పద్ధతులు మారాయి. ఒక వర్ణం, మూడు నాలుగు కృతులు కూడా పాడేవారు. అయితే వాటిలో కల్పన సంగీతాంశం శూన్యం. ఉన్న పాటలు ఉన్నట్టుగా పాడేవారు. అవీ, ఒక విధంగా రాగం తానం పల్లవులకు నాందీ ప్రస్తావనగా ఉండేవి. అనాడూ, ఈ నాడూ కూడా ఈరాగం తానం పల్లవులకే ప్రాధాన్యంఉంది. అయితే క్రమంగా కొంతమంది సాహసులదగ్గరగాయకులు, పల్లవి ఆరంభించే ముందర స్వతంత్రించి స్వరాలాపనచేసేవారు. కృతికి ముందర రాగాన్ని కూడా కొంతసేపు ఆలాపించేవారు. ఆ వేళ అవసరాలకు తగినట్టు త్యాగరాజ, దీక్షితర్, శ్యామ శాస్త్రిల కృతులు అంది వచ్చాయి. వేల సంఖ్యలో లభించాయి. ముఖ్యంగా త్యాగరాజ కృతులు ఈ దశలో ఎక్కువగా ఆదుకున్నాయి. గాయకులు కొత్తకొత్త రాగాలమ కృతులను గాన సభలో పాడి ప్రచారం చేయసాగారు. ఈ రూపేణా వారివారి వ్యక్తిగతమైన ప్రతిభమ ప్రదర్శించుకోడానికి కృత్యారంభంలో రాగస్వరాలాపనలు ఎంతో దోహదంచేశాయి. ప్రజాదరణ ఎక్కువ కావడంతో, పల్లవి అనంతరం, అంత శాస్త్రీయం కాని లలిత సంగీతానికి స్థానం ఇచ్చి శ్రోతలను ఆకట్టుకోడానికి ప్రయత్నించడం అవసరమైంది.

ఈ విధంగా జావళీలవంటివి గాన సభల్లో వినబడసాగాయి. అరవై ఏళ్ల క్రితమే కృతులు ప్రచారంలోకి వచ్చాయి. క్రమంగా అవే, గాన సభల్లో మూడింట రెండు పాళ్ళ కాలం సంపాదించుకున్నాయి. వాటిలో కూడా త్యాగరాజ కృతులే ఎక్కువ. కర్ణాటక సంగీత సభాసంప్రదాయం తెలిసినవారు ఈ నాటి గాన కచేరీలలో కృతిలేకపోతే ఎలా ఉంటుందో సులభంగా ఊహించుకోవచ్చు. కృతిలేని గాన సభ అర్థరహితమవుతుంది. అన్నంలేని భోజనం వంటిది. ఉత్తరాది వారికి "ద్రుపద్" ఇటువంటిది. ఆదరణ కోల్పోయి వెనకబడ్డ ఈ ద్రుపద్‌ను కూడా ఔత్తరాహ శ్రోతలు, గాయకులు, పునరుద్ధరించడానికి ప్రయత్నించి దాక్షిణాత్య సంగీతంలో కృతికి గల స్థానంలో దాన్నికూడా, నిలపడం వాంఛనీయం.

# కేనోపనిషదు

మూలం :

స్వామి చిన్మయానందజీ

అనువాదం :

డాక్టరు W. రాధాకృష్ణయ్య



అట్టివాడు శిష్యత్వమునకు అర్హుడు. జీవితమును జాగ్రత్తతో కృషితో, విచక్షణతో గొప్ప ఆశయముతో నడపువాడు. అతడు గురువును సమీపించి, తన దృష్టికోణములో జీవితమును గమనించి "హే మహాప్రభో ! గురువర్యా ! నిజముగా ఆనందదాయకమైన జీవితమార్గము నేను పొందగల మార్గము ఒకటి యున్నదా! జీవితము, పట్టి తినుట, త్రాగుట, సంతానము పొందుట, చింతల పాలగుట, సంపాదించుట, దుఃఖించుట, మరణించుట, దీనికన్న గొప్ప కార్యము వేరేదైనా యున్నదా ! అంధకార జన్మములనుండీ, అంధకారమరణమువరకూ ప్రయాణము చేయుటేనాజీవితమా! ఆనంద పదవి ఒకటి యున్నదా. దానిని పొంది మరలా ఈ జన్మ మరణములు తొలగు ఉపాయము ఒకటి యున్నదా !

ఇట్టి హృదయ పరితాపము పొందిన పరిపక్వ జీవునికి ఉపనిషదు గురువులు చక్కని మార్గము చూపియున్నారు. తత్త్వమసి, తత్ : అది త్వం, నీవు "అం" -అయి వున్నావు. నీవే అదిగాయున్నావు. అనగా యే పరమపద అధిష్టాన పురుషునకై నీవు వెదకుచున్నావో. అతడే నీవు. ఓ శిష్యా ! నీవు వెదకు పరమవస్తువు నీలోనేయున్నది. పామరునికి ఈ దేహమే తాను అను దృఢ భావము నెలకొని యున్నది. ఈ భావము కడు గాఢమైనది. ఈ దేహము కొరకే బ్రతుకు. దేహము కొరకే శ్రమ. జీవితములో వేరు ఆశయమేమియు కానరాదు. అట్టివానికి పరమాత్మకు తనకు, ప్రభువుకు బానిసకు గల తారతమ్యమునకై యుండును. (సామీప్యముగూడ అగుపడదు.)

ఇంతకన్న కొంత పైమెట్టులోనున్న వారు కొందరు, మనుష్యునికి దేహముతోపాటు మనసు బుద్ధికూడయున్నదని తెలుసుకొనుచున్నారు. అట్టివారికి మనుష్యుని మానవత్వము గోచరమగుచుండును. మనుష్యుని మనోజ్ఞానములతో దైవీభావమున్నదని కనుగొనుచున్నారు. వారు మానవ అభివృద్ధిగాంచుచున్నారు. శాస్త్ర పరిశోధనల, కావ్యరచనల నూతన శాస్త్ర జ్ఞానప్రకటనల, విజ్ఞానవంతుల, వారు చూచుచున్నారు. మానవుడు ప్రకృతి పరిశోధనవల్ల గొప్ప అభివృద్ధిగాంచి యున్నందున మానవునియందు దైవీసంపదయున్నదని వారు నమ్ముచున్నారు. ఇట్టివారు, భగవదంశములో మానవుడు ఒక అంశము అని తెలుసుకొనుచున్నారు.

పై రెండు అభిప్రాయములతో కూడిన రెండు మతములు, సత్యాన్వేషణమున ఏర్పడియున్నది. ఒకటద్వైతము, రెండవది విశిష్టాద్వైతము, మధ్వాచార్యుల ద్వైతమతము. రామానుజాచార్యుల విశిష్టాద్వైత మతము. మొదటిదానిలో పరమాత్మ వేరు. భక్తుడు వేరు - పరమాత్మ పాదముల శరణాగతిపొంది అతని భజించుచుండుటయే, జీవునిగతి. అశాశ్వత పదవి. రెండవది జీవుడు పరమాత్మలోని అంశము అని తెలుపుచున్నది.

పరిపక్వమైన వేదాంత మతమున మాత్రము, అతి దృఢముగా నమ్మకముతో, శక్తి పూర్వకముగా, "జీవుడు భగవంతుడు" అని స్పష్టముగా బోధింపబడుచున్నది. ఈ అభిప్రాయము, ద్వైత, విశిష్టాద్వైతులకు, భ్రమయనితోచుచున్నది. ఏలన వారి దృష్టిలో దేహమే నిత్యమని వారు నమ్ముచున్నారు. కాని వేదాంతులు, సత్యపరమాత్మ జ్ఞానగమ్యమనియు, దేహమునకు సంబంధంలేదనియు తెలియుచున్నారు.

పరిపక్వ దశచెందిన శిష్యుడు, తన దేహము, మానసికవ్యవహారము, దైవమునకన్న భిన్నమని నమ్మి విచారణచేయుచున్నాడు. తన దేహమునకు మనసుకు బుద్ధికి శక్తి ఒడగూర్చు సూక్ష్మ తేజసు మరియొకటి

యున్నదని తెలుసుకొనగలిగియున్నాడు. ఈ శిష్యుని ఇట్టి అనుభవమును గురువు తన ఉపదేశముతో దృఢకరించుచున్నాడు.

అతనికి కావలసిన తర్కనిధానము, అందలి తీర్మానమును విశదీకరించి, వేదాంతగురువు, అతనిని అతని హృదయాంతరమున ప్రకాశించు పరమాత్మసాన్నిధ్యమున చేర్చుచున్నాడు. ఇప్పుడు గురువుయొక్క ఉపదేశములను, శిష్యుడు పూర్తిగా గ్రహించి, దానిని పూర్తిగా గ్రహించగలుగునో, అట్టి శిష్యుడు పూర్ణజ్ఞానవంతుడగుచున్నాడు. అట్టి పరిపూర్ణునకు, తానే ఆత్మయని పూర్తి యనుభవము కలుగును. అతనిపంచకోశముల ఆవరణలొలగిపోయి, తానే శుద్ధ ఆత్మస్వరూపుడని, తెలియుచున్నాడు. తానే ఆత్మయగుచున్నాడు. అటు పిమ్మట తనకు, ఆత్మకు ఎట్టి తారతమ్యము ఉండదు. ద్వైతము లేనేలేదు. వేదాంతి తన అన్వేషణ సత్యస్వరూప సాక్షాత్కారమునకు, ఆరంభమైనను, కడకు, తన హృదయమున తానే పరిపూర్ణత్వము అనుభవించుచున్నాడు. ఇట్టి వారికి శ్రీ శంకరాచార్యుల అద్వైత మతము ఉపయోగపడుచున్నది. ఈ మూడు విధమతముల అభిప్రాయము, శ్రీ రాముని సాన్నిధ్యమున, అంజనేయులు బహురమ్యముగా విశదీకరించియున్నాడు.

"ఓ ప్రభో! నేను దేహభావము పొందియున్న సమయములో నీదాసుడనై మెలగుచున్నాను. నేను నామనోబుద్ధి ఉపాదులలో కలసిన సమయములో నేను నీ అంశమని తెలియుచున్నాను. వాని స్వరూపము ధ్యానించునపుడు నేనే నీవైయుంటున్నాను." అని ఆంజనేయులు తెలిసియున్నాడు. ఇట్లు మన ఆత్మజ్ఞాన పరిపక్వ తారతమ్యములనుబట్టి మనము ఆత్మతో మూడువిధ సంబంధములు పొందుచున్నాము. పూర్ణజ్ఞానులు కూడా కొన్ని సమయములలో దేహ బాధలు అనుభవించుట్లయు, దాని నివారణ కొరకై భగవంతుని పాదముల శరణాగతి పొందుటయు గలుగుచున్నది. కొన్నికొన్ని సమయములలో తన మనోబుద్ధుల వికాసముచెంది, శక్తి వెదజల్లుటయు తటస్తించుచున్నది. ఆ శక్తి ఆత్మవికాసమని తెలియుచున్నది. కొన్ని విశేషసమయములలో దేహ ఆవరణములన్నియు తొలగిపోయి తనలో తాను తీవ్రమైన సమాధినిపొంది, తన స్వరూపమును అనుభవించుచున్న శివోహం"శివోహం" అని కేకలు వేయగలుగును.

ఇట్లుండుటవల్ల మనతో మన సంభంధము అనునది, యేమియు లేదు. (రెండుండిననే సంబంధము కుదురును. ఏకమునకు లేదు.)

ఈ మన హిందూమతమున గల త్రిమతములు ఒకటికొకటి, ద్వేషభావములుగావు. ఒక మతమును విచారించిన అంతకన్న గొప్పదైనది రెండవమతము. అంతకన్న శ్రేష్టమైన మూడవమతము. విశదీకరించి గమ్యస్థానమైన సత్యపదవిని పొందుటకు ఇవి మార్గములు. ఒకటికొకటి, అనుకూలముగానీ, ప్రతికూలములుగాలేవు. పండితమానినులు మాత్రము ఈమతము గొప్పదని, ఆ మతముగొప్పదని వాదించవచ్చును. కానీ, నిజమున ఈ మూడును, సత్యమార్గమున అవి, విశ్రమించగల అనుకూలములైన సత్రములవంటివి. మొదట మద్వాచార్యులదర్శించి, రామానుజాచార్యులను పూజించి వేదాంతమార్గమును త్రొక్కి శంకరస్వరూపముగాంచి అందు ఐక్యము కావలయును.

కనుక మత కలహములు ఇక చాలించవలయును. కార్య పరులు కావలెను. యాత్రాపరులమై పరమాత్మతో మన సంభంధమును, తెలుసుకొన ప్రయత్నించెదముగాక.

దైవము, మతి, నేను :-

వేదాంత మతమునకు గల, మూల సిద్ధాంతములను, కొంత తెలుసుకొన గలిగితిమి. అణువులలో అణువైన సూక్ష్మాంశము, అసత్యస్వరూపము, మనలో తేజో బిందువై యీ పంచ కోశములచే ఆవరింపబడి యుండుట విశదమైనది. ఆ కోశములలో స్థూలమైనది ఈ అన్నమయ కోశము.

(సశేషము)




**భాగవత కథ (3, 4 భాగములు): అనువాదకుడు 'శ్రీరామశరణ్' కుందుర్తి వేంకట నరసయ్యగారు. ప్రకాశకులు : సాధన గ్రంథమండలి, తెనాలి. ఒక్కొక్క ప్రతి వెల రు. 2-0-0 లు.**

ఈ గ్రంథముల కర్త శ్రీ 108 ప్రభుదత్త బ్రహ్మచారి. వీనిలో భాగవత కథలు సులభశైలిలో మనోరంజకంగా రచింపబడినవి. ప్రతియొక్కరు భాగవతము మూలగ్రంథమును పఠించుటకు అందలి విషయములు అవగాహనము చేసికొనుట సులభసాధ్యముకానిది. భాగవతసారము సామాన్య పాఠకలోకమునకు సయితము అందుబాటగులాగున అందలి కథలను రసవంతంగా గ్రంథములుగా రూపొందించి ప్రచురించినందుకు సాధన గ్రంథమండలివారు అభినందనీయులు.

ఈ గ్రంథములు ఆధ్యాత్మిక చింతకు, నైతికపురోభివృద్ధికి విశేషముగా తోడ్పడగలవు.

**గ్రామరాజ్యపాదాలు : 'గోరా'. ప్రతులకు 'ఆర్థికసమతి' పటమట, కృష్ణా జిల్లా అని వ్రాయవలెను. 25 నయాపైసాలు.**

జాతీయ పురోభివృద్ధి నుద్దేశించి గ్రామరాజ్యస్థాపన ఆవశ్యకతను వివరిస్తూ కార్యకర్తలకని వ్రాసిన పు కము. ఇందులోగతాన్ని, వర్తమానాన్ని సింహావలోకనంచేసికుంటూ సామాజిక పురోభివృద్ధికి మార్గాలను, గ్రామరాజ్యస్థాపనకు కార్యక్రమాలను రచయిత అనుభవపూర్వకంగా సూచించారు. అవి రాజకీయ, సాంఘిక సమస్యలలో విశేషముగా నుపయోగపడగలవు.

**ధ్యానపద్ధతి : 'శ్రీరామశరన్' కుందుర్తి వేంకటనరసయ్యగారు. ప్రకాశకులు: సాధన గ్రంథమండలి, తెనాలి. వెల 50 నయాపైసాలు.**

భగవత్సాక్షాత్కారమునకు ధ్యానపద్ధతి ఉత్తమోత్తమ మయినదని ఆదిశంకరులవంటి దివ్యపురుషులు చాటిరి. అట్టిధ్యానపద్ధతి యీ చిన్న పుస్తకంలో వివరించబడింది.

ఇది ప్రతియొక్కరు పఠించి, విషయమును తెలిసికొని యిహపరములలో సుఖమునపేక్షించవలసియున్నది. ఇది అమూల్యమైన గ్రంథము.

**శ్రీ సాయిబాబా : శ్రీ సి. సి. పున్నయ్య (సంపాదకుడు). ప్రచురణకర్తలు సాయినిలయం, షెనాయ్ నగర్, మద్రాసు 30, వెల 25 నయాపైసాలు.**

శ్రీ సాయిబాబా దివ్యజీవిత విశేషములు, బాబా సందేశమును వివరించుచు సాయినిలయంలో జరుగు పూజారాధనల కూర్చబడినవి. భక్తిముక్తి మార్గముల ప్రబోధించుచు ఐహికాముష్మిక సుఖముల నిచ్చుచున్న శ్రీ సాయిబాబా మహిమను, అయన సందేశముయొక్క విశిష్టతను ఈగ్రంథము పఠించి తెలిసికొనగును.

---

# సంపాదకీయములు

## సహకార వ్యవసాయము

సహకారపద్ధతుల ననుసరించి వ్యవసాయమును కేంద్రము తలపెట్టుట కొంత కలవరమును సృష్టించినది. అయితే యీ కలవరము చాలవరకు భూస్వాములకు పరిమితంకావలసినదే కాని కొద్ది గొప్ప భూవసతియున్న వారికి కాదు.

సహకార వ్యవసాయ ఉద్దేశలక్ష్యాలను పారజూచినచో వ్యక్తిగతంగా కొద్ది గొప్ప భూవసతి యున్న రైతులు సేద్యముచేయుటకు పడుతున్న పాట్లు, వారి ఆర్థికదుస్థితినాధారముగా చేసికొని భూస్వాములు, సంపన్నులు అవలంబిస్తున్న నిరంకుశవైఖరినుండి తప్పించి సమిష్టిగా సహకారవిధానము ననుసరించి తమ భూములను సాగుచేసికొని ఫలసాయమును న్యాయంగా తమ భూవసతిననుసరించి, వాటాలననుసరించి పంచుకొనుట ప్రధానము.

సహకార వ్యవసాయము, సన్నకారు రైతుల ఆర్థికస్థిమితమును మెరుగుచేయుటకని ఉద్దేశించబడినది. ఇందులో బాధ్యతలను, అవకాశములను న్యాయంగా పంచుకొని ఉత్పత్తులను వృద్ధిచేయుట కవకాశములున్నవి. వ్యక్తిగతంగా తాము సాధించజాలని వ్యవసాయ పరికరాలు, విత్తనాలు, ఎరువులు యిత్యాదులను సహకారసంస్థగా సేకరించుట సులభము.

## కాలం నిర్ణయించే రచనలు

శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారి షష్టిపూర్తి సన్మాన సభలో శ్రీ కామేశ్వరరావుగారు ఏరచన విలువైనా కాలమే నిర్ణయిస్తుందనియు, దేశానికవసరంకాని రచన నశిస్తుందని వివరించారు.

రచన విలువను కాలం నిర్ణయించవచ్చును; కాని విశిష్టతానవీనతలతో ఉపయుక్తమయిన రచనలను సృష్టించి కాలాన్ని, దాంతోపాటు పాఠకులను రచయిత తన్ననుసరింపజేసికోకలుగాలి. రచనా విశిష్టత ఎంతసేపటికి నిర్మాణాత్మకంగానుండి ప్రజాజీవితి పురోభివృద్ధులమీద ఉత్తమ మయిన ప్రభావం కలిగియుండాలి.

దేశానికవసరంకాని రచనలు నశిస్తవి అనడం నిజమయినా దేశానికి ఎట్టి రచనలవసరం, అవసరము కానివేవి అనే విషయాలను రచయిత మనసులోనుంచుకొని రచనలు సాగించాలి.

---

## శ్రీ హేవళంబినామ సం॥ర ఆశ్వయుజ, కార్తీక మాసములు

| | | | |
|---|---|---|---|
| అక్టోబరు నెల -1957 సం॥ | 16 | బు | అ 51.14 పున 41.40 |
| | 17 | గు | న 46-23 పుష్య 38-46 |
| | 18 | శు | ద 40.45 ఆశ్లే 35-4 గురు మాఢ్యరహితం |
| | 19 | శ | ఏ 34.36 మ 30-49 |
| | 20 | ఆ | ద్వా 28.10 పూఫ 26.15 గోవత్సద్వాదశి |
| | 21 | సో | త్ర 21-43 ఉఫ 21-39 తిథిద్వయం, మాస శివరాత్రి |
| | 22 | మం | చతు 15.32 హ 17.18 శ్రీ కృష్ణాంగారక చతుర్దశి, దీపావళి |
| | 23 | బు | ● అమా 9.49 చి 13.29 |
| | | | **కార్తీక మాసము** |
| | 24 | గు | శుపా 4.53 స్వా 10-23 కార్తీక స్నానవ్రత దీపారంభం |
| | 25 | శు | వి 0-54 ఏష్యం 56.48 |
| | 26 | శ | చ 56.1 అనూ 7-11 నాగ చతుర్థి |
| | 27 | ఆ | పం 55.35 జ్యే 7.20 |
| | 28 | సో | ష 56-29 మూ 8.53 |
| | 29 | మం | స 58-30 పూషా 11.17 |
| | 30 | బు | అ 60.10 ఉ 14-54 |
| | 31 | గు | అ 1.45 శ్ర 19-31 |
| నవంబరు నెల 1957 సం॥ | 1 | శు | న 5.39 ధ 24.49 |
| | 2 | శ | ద 9-54 శత 30-36 |
| | 3 | ఆ | ఏ 14-41 పూభా 36-36 త్యాజాభావః |
| | 4 | సో | ద్వా 19:26 ఉభా 42-33 శూన్య తిథి |
| | 5 | మం | త్ర 23.56 రే 48-11 |
| | 6 | బు | చతు 27-54 అశ్వ 53-13 |
| | 7 | గు | ○ పౌ 31.6 భ 57-27 |
| | 8 | శు | కృపా 3-19 కృ 60-10 |
| | 9 | శ | వి 34-24 కృ 0.22 |
| | 10 | ఆ | త 34.35 రో 2.22 |
| | 11 | సో | చ 32-42 మృ 3-5 కేదారవ్రతం |
| | 12 | మం | పం 30-7 ఆర్ద్ర 2.42 |
| | 13 | బు | ష 26-20 పున 1-6 పుష్య 57.29 |
| | 14 | గు | స 21.35 ఆశ్లే 55-6 తిథిద్వయం |
| | 15 | శు | అ 16.4 మ 50.53 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.